శ్రీ

# సంగీత పాశుపతార్జునము.



ఇది,

మ॥ రా॥ శ్రీ గాడేపల్లి సూర్యనారాయణశర్మగారిచే

రచియింపంబడి,



రాజమండ్రి కాపరస్థులయిన

కర్రా అచ్చయ్యగారిచే

మొదటికూర్పు.

సి. హెచ్. కైలాసరావు బ్రదర్సువారి

కమలా ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

కాకినాడ.

1912.

## ఈనాటకమందు వచ్చుపాత్రలు.

### పురుషులు

ఇంద్రుఁడు — దేవతలరాజు.

బృహస్పతి — దేవగురువు.

వరుణుఁడు — దిక్పాలకులలోనొకఁడు.

నారదుఁడు — దేవఋషి.

వ్యాసుఁడు — భారతగ్రంథకర్తయగుముని.

అర్జునుఁడు — పాండవమధ్యముఁడు కథానాయకుఁడు

శంకరుఁడు — పరమేశ్వరుఁడు

భృంగి — ప్రమథులలోనొకఁడు.

మాతలి — ఇంద్రసారథి.

ఎఱుకలు (నాగఁడు-వీరఁడు) } మహారణ్యనివాసులు.

మునిబాలురు — మునిశిష్యులు.

నందుఁడు-గోపుఁడు — స్వర్గపాలకులు.

దంభజంభోదరులు — రాక్షసులు.

### స్త్రీలు.

ద్రౌపది — పాండవులవనిత.

పార్వతి — పరమేశ్వరి.

ఊర్వశి — అప్సరస.

శశి — ఊర్వశి చెలికత్తె.

---



ఓమ్

శుభమస్తు. అవిఘ్నమస్తు.

# సంగీతపాశుపతార్జునము.



## నాంది



"॥ శ్రీరంజిల్లఁగఁ బార్వతీరమణి తాఁ ♦ జిత్తంబులోఁ బొంగుచున్
మారఘ్నుం డితఁ డంచుఁ గౌఁగిటనునర్ ♦ బంధించెఁ దాపంబు ప్రా
నారా! యంచుఁ బ్రియంబులొందు శివుఁడ♦ య్యార్తావనుం డర్జున
స్తోరాట్పాశుపతాస్త్రదాత మిము సం♦పత్ప్రోథులన్ జేయుతన్ ॥

[నాంద్యనంతరమున సూత్రధారుఁడు ప్రవేశించును.]

త్రధారుఁడు—హా! హా! పరాత్పరుని కారుణ్యము! భక్తవత్సల బిరుదాంకుఁడన నాతఁడేకదా! (సభవైపుఁ జూచి) ఓహో! ఏమిది! సుగుణపారావారులగు సభాస్థులాజ్ఞాపించినమాటయే మఱచితి! నీతిప్రబోధకమగు నాటకమే దేనిఁ బ్రదర్శింపుమనికదా? నటినిఁ గనుగొందును. (తెర వయిపుఁ జూచి) నటీ! నీవలంకరించుకొనుటఁ దైన యెడల నొకసారి నిటురమ్ము. [అంతమారిషుఁడు ప్రవేశించును]

మారిషుఁడు— (తనలో) మోహించి మీఁదఁబడిన వేశ్యామణిని దల్లియని వదలిన యీతనికన్న సుగుణసంపన్నుఁడుండునా ? (సూత్రధారుఁజూచి ప్రకాశముగా) బావా ! యిదిగో వచ్చితి .

సూత్ర— మారిషా నిన్నుఁబిలువలేదే ! నీచెల్లెలేది ?

మారి— ఆమె యేదియో యొకనాటకముఁ జదివి మనవారికి బోధించుచున్నది .

సూత్ర— సరే పోనిమ్ము ! నీవయినను నాపనికి గొంతరావు యీసభాసదుల యాజ్ఞ విందువా ?

మారి— (వినుగుతో) ఏదోనొక నాటకమాడుమనియేనా ?

సూత్ర— ఏమట్లు వినుగుఁజెందెదవు ?

మారి— ఎక్కడఁజూచిన నాటకులే వారికిఁదోడుగా నాటకములు బయల్దేరి వారికొంపలు ముంచుటచే.

సూత్ర— ఏమిమారిష ! నీచెల్లెలికి నిక్కముగఁ బెద్దన్నయ్య లాగుంటివి ! !

గీ॥ సంఖ్యపెక్కుటచే దోష • సంక్రమముగు
నంచునెంచఁదగునె ? విద్య • కంతమున్నె ?
తారతమ్యత పెక్కుతోఁ • దనరెనేని
మంచిచెడ్డలు బాగుగా • మసలుగాదె ? ॥ 2

కావున నూరినిండ నాటకులుండఁబట్టియు దేశమునిండ నాటకములుండఁబట్టియుఁ జెడుగులేకపోవుటయేఁగాక మఱింత మంచియే కలదు . ఒకవేళ రసవిహీనములగునవియే పెక్కయిన సరసములకు వన్నె మఱింత హెచ్చుఁగదా ?

మారి— (నవ్వుచు) కర్తవ్యాంశమునకు రాక దూరముగఁబోదు వేల?

సూత్ర— నీవులాగితివికాన. నీతిదాయకమయిన నాటకమేదియొకదా
మారి— నాకుఁ దారతమ్యములు తెలియవుగాని నేనిప్పుడే యొకనాటకమువింటిని.
సూత్ర— దానిపేరు ?
మారి— పాశుపతార్జునము.
సూత్ర— (స్మృతి నభినయించి) ఔనౌనదియే నాకిపుడు ప్రదర్శనీయమనితోఁచెడి.
మారి— అదిక్రొత్తదెట్లుండునోకదా !
సూత్ర— నీవు వినినంతవఱకెట్లున్నదో చెప్పుము.
మారి— నాకుఁ దోఁచినట్లు నక్కడివారనుకొనునట్లు చెప్పెదవినుము

గీ॥ శైలికఠినంబుగాదుహా ♦ స్వరసమచ్ఛ
టచ్ఛటనుబుకుచుండుఁగా ♦ సంతరార్ద్ర
మునుజెలంగుశృంగారాదు ♦ లనుమెలంగు
బలుమెఱుంగుఁబరంగు న ♦ భంగురగతి॥ 3

సూత్ర— గుణగ్రహణపారీణులగు సభాసదులే దానిస్వారస్య మెఱుంగఁగలరు రమ్ముపోదము. (పోఁబోవ)
మారి— (చేయిఁబట్టుకొని) కవినామము జెప్పకయే యెక్కడకుఁబోయెదవు.
సూత్ర— నీవెఱుఁగవా ?
మారి— నీవుచెప్పకున్న నెట్లుతెలియు ?
సూత్ర— గీ॥ విద్యకిల్లుఁగాడేపల్లి ♦ సద్యశోన్న
యంబువేంకటశాస్త్రిజ్యే ♦ ష్ఠాత్మజుండు
రాజమాంబాతనూజుఁడై ♦ రహిఁ[illegible]ంగు
సూర్యనారాయణార్యుండు ♦ సూవె! కర్త॥

మారి— బావా ! పదునెన్మిదేండ్ల బాలుఁడుకాఁడా యితఁడు ?

సూత్రి— ఔనట్లేవినియన్నాను

మారి— సరే ! పోవుదు

సూత్ర— (ఆపి) మానాటకముచూచి పోవుదుగాని యాఁగుము.

(సభతో) ఓసభాసదులారా ?

మ ॥ అమరప్రాభవమంతచూచివనమందా ◆ ద్రౌపదీదీనవా
క్యములాలించికిరీటిశంకరులసం ◆ గ్రామంబులోనిల్చిమో
దముతోనూర్వశిచర్యలఁగనిరణ ◆ స్థానంబుపార్థుండొన
ర్చుమహాత్కార్యముగాంచి మంచియొకి లే ◆ శోధించిమో
దింపుఁడీ ॥ 5

[నిష్క్రమింతురు]

ఇది ప్రస్తావన.

ఓం

శుభమస్తు.

# పాశుపతార్జునము.

## ప్రథమాంకము.

### 1 వ రంగము—సుధర్మ.

[ఇంద్రనారదబృహస్పతివరుణాదు లుచితాసనోపవిష్టులై ప్రవేశించుచున్నారు.]

ఇంద్ర—గురూత్తమా! ఎల్లపుడు సురపురంబు బ్రతుకు దినదినగండంబై నా ప్రారబ్ధవశంబున నిట్లే యుండవలెనా?

ఉ॥ లోకములోన రాజవరు లుంగల రెందఱో వారివారలన్
నాకపురంబు సంబలెన నారతముం భయమొందఁ జేయున
స్తోకరిపువ్రజంబుకయి తొందర కల్గకపోదు కాని బల్
కాకులయట్లు లెప్పుడును గాచుకసిల్గులఁ బెట్టిరే యెటన్॥ 1

నాకర్మం బేమియోకాని నామనం బెప్పుడును ఏశత్రువులువచ్చి ముట్టడింతురో యనియు నేక్రూరులు దేవబృందముం గందునొందింపఁ జూతురో యనియునే జంకుచు నెదిరిబలముఁ జూచుకొన్నను గుదుటఁ బడక దడదడఁ గొట్టుకొనుచునే యుండును.

బృహ—అమరనాయకా! ఆపద లెంతటివారికిని రాకతప్పవు. రాజ్య

మున్నదన్నప్పుడు శత్రువులు నుండకపోరు. శత్రువు లున్నయె డఁ గెలుపోటములు మానవు. ఒక్కచో నోడినంతమాత్రిము న నీవంటివానికే యధైర్యదేవ తావేశమైనయెడల మొన్న నా కుఁ గాలకేయులవలనఁ జరిగిన పరాభవమున కేమికావలసినది? కావున నెట్టులైన నీశత్రుల నిర్జించుకర్జం బాలోచింపుము.

నార—అన్నిటి కేమికాని సర్వసురనికరంబునకు గురుండై పూజ్యుం డైన నీబృహస్పతిని వాళుకనిహతకుపంపున నొక యసురవీరుఁ డు—

గీ॥ కాలుసేతులు గట్టిగాఁ ♦ గలియఁగట్టి
క్రిందఁ బడఁద్రోసి పెత్తురు ♦ చిందునటులు
గడ్డ మాడించి నవ్వుచుఁ ♦ గార్లు పెక్కు
ప్రేలెనట వింటిమే యిట్టి ♦ వింతలెపుడు? 2

అందఱు—హర! హర!

వరుణ—(లేచి) గురూత్తమా! ఓనిర్జరప్రభూ! ఓనారదా! యిదివ ఱ కెందఱో మనవీటిపై దండు విడిసిరి, యెందఱితోడనో యుద్ధ ముఁ జేసితిమి. ఎందఱినో నిర్జించితిమి. మరియెందఱో మనల నోడఁబుచ్చిరి కానియిట్టియుద్ధము నిట్టిశత్రువుల నిట్టిపరాభవ ముల నెప్పుడుం గని విని యెఱుఁగము.

గీ॥ రిపుపురంబు లగాధవా ♦ ర్ధినిఁజెలంగుఁ
దైత్యబలములు నినుకప్రాఁ ♦ తరలబోలు
వారిధాటికోర్వఁగ శూలి ♦ పాణి కగునె?
దనుజకార్య మనుభవించు ♦ మనకె యెఱుక!

మొన్న నాపడ్డపాట్లు నానోటనే వినుండు—

గీ॥ వారిదెబ్బకు గుఱ్ఱంబు ◆ పాఱిపోయెఁ
బాశములు వారిముందట ◆ వమ్ములయ్యె
బలములచ్చటఁ దమకాలి ◆ బలముఁజూపె
నెక్కటిగనున్న ననుఁబట్టి ◆ నొక్కివేసె॥ 4

మరియు నోవిబుధులారా?

గీ॥ ఏమిచెప్పుదు నటమీఁద ◆ నేఁపుమీఱి
మొండిరక్కసులందఱు ◆ మూఁగి నన్ను
నీబలం బింతయేన యో ◆ నీచ! యనుచు
నమితముగఁ దిట్టి ముఖముపై ◆ నుమిసి రకట॥ 5

ద—హార! హార! వారెంతటికైన సాహసింతురు. కార్యమునకుం దోడు సామర్థ్యము నొసంగిన దేవు ననవలయునే కాని వేఱయే మున్నది? దాయాదుల కుండవలసిన కోపము వంతనుఁ గలిగిరి. ఏమిసేయుదుము? ఇట్టివారికి మృత్యువుకూడ వెఱచు నని తలఁచెదను.

ప—అయ్యో! మొన్న మనమృత్యుదేవి కైనపాట్లఁ దమ రెఱుఁగరు కాఁబోలు! అట్లైన వినుండు. ముందెంతో యార్భాటంబున రక్తారుణనేత్రయై పండ్లు పటపటఁ గొఱుకుచు మ్రింగఁబోయిన మనమృత్యుదేవిని బలువురు చుట్టుముట్టి యెట్టకేలకుఁ గ్రిందఁ బడఁద్రోసి

శా॥ కాలుం జేయియుఁ ద్రాటితోడ బిగియం ◆ గాఁగట్టి బల్ వాడియౌ
వాలుం బుచ్చుక జుట్టుగోసి మఱి స ◆ ర్వాంబైన కీళ్లూడఁగా
వాలారుం గుసుపంబులం బొడిచి యా ◆ పాపంబునకా బోక నీ
యాలీ యమ్మ యటంచుదిట్టి రసురు ◆ ల్హా! యిట్లనే యుండునే? 6

బృహ—శివ! శివ! మృత్యుదేవతకేనా! యిట్టిపరాభవము? ఆహా! ఇఁక వీరి నిర్జించువా రెందునను లేరు కాఁబోలు! మృత్యుదేవినే నిర్జించువీరికి వేఱ మృత్యువుండునా? అయ్యయ్యో! యిట్టివింత లెన్నఁడైనఁ గంటిమా? ఇఁక వీరిముందు నా వైకుంఠవాసుఁడును గడ్డిపారకకు మాఱఁడని తలఁచెదను. ఆహా! లోకం బెంతవింతగా మాఱినది?

క॥ శిష్టులు జగతినిఁ బొందెదు
కష్టములకు లెక్కలేదు ♦ కర్మ మదేమో?
దుష్టతతి కష్టమెఱుఁగకె
యిష్టసుఖంబులను జెంది ♦ యెంతయుఁ జెలఁగున్॥ 7

మఱియు—

గీ॥ శూరుఁడై యుండనేరఁడు ♦ సుజనుఁ డెప్డు
శూరుఁడై యుండిన బలమ్ము ♦ సున్నయగును
బలముకలిగినఁ గౌర్యంబు ♦ కలసితిరుగు
నొకటికల్గిన మఱియొక ♦ టకట? లేదు॥ 8

గార—(తనలో) ఆహా నామనం బిపుడెంతయు శోచనీయమై యున్నది? వేఁడివేఁడి పరమాన్నముండినను ఖాందస[బ్రాహ్మణుఁడు నాలుక చుఱ్ఱుమని కాలుచుండినను వదలక మిగుల నాసక్తితోఁ దినుభంగి నామనస్సు సత్యంత స్నేహితులైన బృందారకులకుఁ బరాభవములై ముప్పతిప్పలఁబడి మూఁడుచెఱువులనీరు [దాగుచుండినసుం జిఱుతపోరొకటి జరిగెఁగదా యని యూరక వెఱ్ఱి సంతోషముఁ బొందుచున్నది. నామనస్సునకు బుద్ధిలేకున్నను నాకైన బుద్ధియుండి వీరి కేదైన నొకయుపాయ మాలోచిం

చి చెప్పవలదా? ఇట్టిపనిఁ జక్కఁబెట్టువారి నేరిఁజెప్పినను నా పొట్టనిండించి వారికార్యముఁ జేయువానినిఁ జూడవలెఁ గాని నాపొట్ట కింతమట్టిఁగొట్టి కల్లబొల్లిసంధులఁ జేయు నిర్భాగ్యదామోదరులఁ జెప్పరాదు. అట్టివా రీదేవతలలో నెవ్వరైన నుందురా?

గీ॥ చావదెబ్బలుఁ దినిరి యీ ♦ దేవగణము
వరములిచ్చెను బ్రహ్మ కా ♦ వరముఁ జెంది
శూలి భక్తులౌ దనుజాల ♦ నేలచంపు?
నింక నిర్జరార్తినిఁ దీర్ప ♦ నేరు లేరు॥ 9

ఇంక నరులలో నెవ్వరైన నుండకపోదురా?

ద్రు—అట్లైన దేవా! మనదారసుతులతో మరల నష్టదవులఁ బడి కడు నిడుమలఁ గుడిచి యడలవలసినవారమేనా? అయ్యో!

సీ॥ బృందారకులకు నా ♦ నంద మొందించు నా
నందనం బకట! యే ♦ చంద మగునో?
పెక్కుక్రీడలకు నిక్క ♦ యక్కటా! యీపురం
బేఫక్కి నిక్కట్టు ♦ లెన్ని పడునో?
చింతామణీభద్ర ♦ సింహాసనం బిది
యేక్రూరరాక్షసుఁ ♦ డెక్కఁగలఁడొ?
నిత్యంబు నాపజ్జ ♦ నృత్యంబుఁ జేసెడి
కాంతాగణం బేరి ♦ పొంతఁ బడునో?
గీ॥ యక్కటకట! భార్యాపుత్రు ♦ లొక్కపరిని
మీఁదఁబడి యేడ్వ మనవారు ♦ మీఁది తెరువుఁ
గాన కెట్లు గాసిలుదురో ♦ మానభంగ
మునకు వెఱచి వనిత లెంత ♦ వనటఁ గంద్రొ? 10

ఆహా! గురూత్తమా! యఖండనిర్జరపఙ్క్తికరంబునకు నెంతకీడు మూడనై యున్నది? శత్రువు లెప్పుడు పైఁబడి నిర్జరుల నిర్జింతు రో యను భీతిచేఁ గర్తవ్యాంశ మేదియుఁ దోఁపకున్నది. సకల కార్యంబులయందును నిర్జరుల కేలూఁతయగు తమయాలోచనం బేదియై యుండునో తెలియరాకున్నది. ఒకరికరణు వేఁడుదమన్నను నేరును గానరారు. యుద్ధమొనర్తమన్న నాపాట్లిది వఱకే యైనవి.

బృహ—నాయాలోచన కేమున్నది? అన్నియు నుడిగినవి. కాలవ్యత్యయంబున సుర లసురులచేఁగనవు గఱవవలసివచ్చె. దీనికై చింతింప నేమిలాభము? ముఖముపై గుడ్డవైచుక యుస్సిరో యనుకొనుచు నేకొండగుహాలోనికో యేతుప్పచాటునకో పోయి మనమందఱము డాఁగియుండుటకు నోఁచికొంటిమి. నేఁటికి మనపుణ్యము లిట్లు ఫలించినవి.

ఇంద్ర—అయ్యో! కాల మెంతలో మాఱినది! క్షణములో భిక్షుకుని రాజుగాను రాజు భిక్షుకునిగాను జేయు విధివైపరీత్యంబు కడు గడు నాశ్చర్యకరంబు.

నార—(తనలో) ఎంతవెఱ్ఱినైతిని! యూరక యాలోచించుచుంటినే! నరాంశాసంభూతుండైన యాయర్జునభూపాలశేఖరుం డుండియుఁగూడ నెవరికొఱకో చూచుచుంటిని! (ప్రకాశము) ఓహో! బృందారకులారా! ఓసహస్రాక్షా! ఏల వావిడిచి చేలలై మీరీ చిఱుతకార్యమునకై వాపోయెదరు? దీనికి నొకయుపాయం బిపుడనాకుఁ బొడకట్టినది.

ఉ॥ నరనారాయణు లన్పురాణమునులక్ ♦ ధన్యాత్మకుండైన యానరుఁ డాపాండుధరాపతీంద్రునకు నా ♦ నందంబు పెల్లుబ్బ ని

ర్జరసామ్రాజ్యవహేంద్రసాంద్రకరుణా ✦ సారోద్భవాత్మోద్భవుం
డు రణస్థైర్యగభీరధైర్యుఁడుగ మే ✦ సుందాల్చె లీలం ధరన్ ॥11

ఆదివ్యపురుషునినామం బర్జునుఁడు. అతనినామముఁ దలఁచినం తమాత్రమున సకలదిగంతశత్రుసంతానములు నొక్కుమొగి నే యమనిలయమునకో పాటి డాఁగవలసినదే! శ్రీమన్నారాయణా వతారుండైన శ్రీకృష్ణుఁ డీతనికి బావయే. వేఱ వర్ణించి నేఁజెప్ప నేల. అతనిఁగన్నతండ్రియగు మనయింద్రుఁడే యెఱుఁగును. అయిన నానోటఁగూడ వినఁదలఁతురేని.

ఉ॥ భండనమండలంబునఁ బ్ర ✦ భాకరదీప్తుఁడు వానికిన్ ధనుః
కాండము గాండివం బిఁక న ✦ ఖండబలాన్వితదేవరక్షితా
ఖండలఖాండవాటవిని గాల్చు ✦ ప్రతాపము నక్షయంబుగా
మండితమైనయమ్ముపొది ✦ మాటలికేటికి వానిధాటికై. 12

ఖాండవదహనకాలంబున నాతని నిశితవిశిఖాసారంబు సురలకం దఱి కనుభవమే కాన వర్ణించి చెప్ప నవసరములేదని తలంచెద. ఇంకొకటి, యాతనిసుగుణగణంబుల గణింప నావాణీరమణునికైన నలవికాదు.

గీ॥ సత్యశీలత గహనవా ✦ సంబె చెప్పు
నార్తరక్షణ గయకథ ✦ యరసి పలుకు
శాంతభావంబు ద్యూతని ✦ శాంత మఱచు
సద్గుణంబులఁ గృష్ణుండు ✦ సాక్ష్యమిచ్చు॥ 13

ఇట్టిజగదేకవీరుఁ డక్కట మఱొక్కని నెక్కడ నీమ్రుక్కడి రక్కసుల నుక్కడఁగింపఁ గనంగలేమని నొక్కి వక్కాణింపఁ గలను.

( నేపథ్యమున )

వనమయూరవృత్తము.

పామరమన్మథ ◆ భంజన! కాలా!
భూమిధరాత్మజ ◆ భూరివిలోలా!
నామనమందున ◆ నాటవదేలా
నీమహితాకృతి? ◆ నిర్జరపాలా! 14

నార—( తిరిగిచూచి ) అల్లదిగో! కేవలపరమేశ్వరుఁబోలి యీశ్వర ధ్యానంబు సల్పికొనుచుఁ గృష్ణద్వైపాయన మహామునీశ్వరుఁడి టె వచ్చుచున్నాఁడు.

( అంతవ్యాసమహామునిప్రవేశము ; ఎల్లరు లేతురు. )

ఇంద్రు—దేవా! ఇంద్రుఁడు దేవర పాదారవిందములకు మ్రొక్కుచు న్నాఁడు. ( అనిమ్రొక్కును )

వ్యాస—ఇష్టప్రాప్తిరస్తు!

ఇంద్రు—దేవర యీయున్నతాసనము నధిష్ఠింతురుగాక!

వ్యాస—( అట్లుచేసి ) వత్సా! కూర్చుండుము. నారదా! క్షేమమా? ఇప్పు డెద్దియో మహదంశమును గూర్చి ముచ్చటించుకొనుచు న్నట్లున్నది.

ఇంద్రు—మహదంశమున కేమున్నది? కాలకేయాదిదుష్టరాక్షసకృత పరిభవంబులకై చింతించి వారిపాల్పఁబడ నోల్లక శరణాగతరక్ష ణబిరుదాంకు లేరుందురా యని విలపింప నీమహాత్ముఁడు నీమ నుమఁడగు ధనంజయు నిరూపించి చెప్పుచున్నాఁడు. మహాత్ములఁ దెరువరయుఁడని సురనికరంబు నాముఖమున వేఁడుచున్నవి.

వ్యాస—తెరువున కేమున్నది? నామనుమఁడును నీకొడుకునైన యర్జు నుఁ డీకార్యంబు జక్కఁజేయఁగలఁడు.

ఇంద్రు—స్వామీ! ఆనాఁడితఁ డీకార్యమునకు సాహసింపఁగలఁడా?

వ్యాసు—సందియమేమి? ఆతఁడు నిరుపమానపరాక్రమశాలి. విజయుఁడు. అదియుఁ గాక మత్ప్రేరితుఁడై సోదరబోధితుఁడై యాతఁ డిపుడు పాశుపతాస్త్రసంపాదనకై హిమవన్నగప్రాంతకాంతారంబున నీశ్వరుంగూర్చి తపం బాచరింపనై యున్నాఁడు. పాశుపతమే సమకూడినయెడల నాతఁ డీకార్యమే కాక యేకార్యమైనఁ జక్కఁజేయఁగలఁడు. కావలయు ననిన నీ వేఁగి యాతని మనస్స్థైర్యాదిసద్గుణంబులఁ బరికింప నగును.

ఇంద్రు—(వినయముతో) దేవరయాన శిరసావహించుచున్నాను. తమరన్నఁ దరువాత వేఱుగ నవసరము లేదు గాని బ్రాహ్మణరూపమునఁ బోయి యాతనికి శివోపాసనోపదేశముఁ జేసి రా నానతీయ వేఁడెదను.

వ్యాసు—అవశ్య మట్లే చేయుము.

(నేపథ్యమున)

చ. జలజవిభుండు తీక్ష్ణకర ♦ జాతము సూటిగ మీఁదఁ బర్వ నీ
డలు కడు నోర్వమిన్ ద్రుమకు ♦ టంబులక్రింద వనాటకోటితోఁ
గలసి భయంబు పో నిలుచుఁ ♦ గ్రాలినభక్తి నరుల్ ధరిత్రిఁ గో
ర్కులు సమకూఱ శంకరునిఁ ♦ గొల్తురు మధ్యదివంపు వేళలన్. 15

వ్యాసు—(ఆలకించి) సహస్రాక్షా! లోకాక్షుండు మింట నలంకరించె నని మధ్యాహ్నానుష్ఠానంబుల సూచించుచు వైతాళికుండు విన్నవించుచున్నాఁడు. ఇఁకనీసభఁ జాలింతమా?

ఇంద్రు—చిత్తము.

(యవనికజాఱును.)



## 2 వ రంగము.

ప్రదేశము—అరణ్యము.

ప్రవేశము—ఇద్దఱు ఎఱుకులు.

ఒకఁడు—నాగా! మనకోటలో గుడిశేసుకున్న దొర్లనిసూసినది మొదలు దయ్యాల్కిలాగు దండా లెడదామని తోస్తదేట్రా?

నాగఁడు—ఓరియీరా! ఆరెక్కడిదొర్లో గాని ఎప్పుడు గడ్డాల మునీస్సర్లతో గుమిగూడి యేదాలు రామాంథాలు పురాంథాలు సిదుముకుంటా ఉంటార్రా!

వీరఁడు—ఆదొరల్ని కౌరవులతేఁడైన దురోదనుఁడు యీకానలోకి బొమన్నాడంట్రా పాప మీరేమీ యెఱుగరుసుమా!

నాగ—పొమ్మన్లేదురా? జూదాలాడించి అంతాదోచ్చేసి పన్నెండేళ్లు వనోసం జెయ్యమన్నాడంట్రా!

వీర—అవునా్రి. ఇంకా రచ్చలో నాయమ్మ దోవతమ్మగారిబట్ట లొలిసేసారంట. అప్పుడాయమ్మ కిట్టా! కిట్టా! యని రాగా లెడ్తె అచ్చయమై పోయినాయంట్రా బట్టలు!

నాగ—అమ్మ. ఆళ్లబొడ్డుపొక్క. అయితే యీరాఆరూ! అప్పుడాబీస్మంతాతగా రూరుకున్నారంట్రా! మనబీమన్నా అజ్జన్నా ఏం గోపగించ లేదంట్రా!

వీర—ఊరుకోకేమంటారు? దమ్మన్న గారూరుకుంటే!

నాగ—అప్పుడు నీవుంటే ఏం సేద్దువురా?

వీర—నానే వుంటేనా! ఊసతో ఆకన్నున్ని దుస్సాసనయ్యని ఆగుడ్డియ్యని ఆరి నందర్నీ ఒక్కదెబ్బతో కైక్కుమనిపించనంట్రా?

నాగ—దురోదనదొరగారు పెద్దుక్కలాగుంటదే యీగదుచ్చుకోని

నెత్తిమీఁదేత్తారంటే! మరేం సేత్తావు?

వీర—నావులిగోళ్లెట్టుకోని ఒల్లంతా గీరెయ్యనా?

నాగ—ఓరెట్టిముండాకొడకా! నీకుమంత్రాల్రాయేం?

వీర—రాకేంరా. మొన్న మనసింతకాడ కాయలొక్కుత్తున్న బాపనోణ్ణి ఆలాగే ఉండేలాగ మంత్రిం గట్టేశాను గానంట్రా?

నాగ—యీరా? అయితేం గాని యీబామ్మల్లు అందర్కి బోజనాలెలాగరా? ఒక్కొక్కడు మళ్లి పిల్లి దాటలేనం తేసిపోగులాగు తార్గందా?

వీర—దోవతమ్మగారికి చూరేనారాణమూర్తి ఆయమ్మ పళ్లంటుకుంటే పంచపాచ్చపరమాంధాలూ అయ్యేటట్టువొరాలిచ్చినాడంట్రా!

నాగ—మనపెట్టలకి కూడా యిలాటి వొత్తే మాబాగుండున్నా!

వీర—ఓరియెట్టిముండాకొడా! మన కీజల్మంలో లేదురా!

నాగ—దానికేం గాని యీరా? రోమాలముని అంతబాగా కతల్సెప్తాడురా!

వీర—సెప్పడేంట్రా? ఆయన సెప్పుతుంటే కత అక్కడ జర్గుతావున్నట్టే ఉంటదిరా!

నాగ—అవున్గాని యీరా? అజ్జున్నగారెప్పుడైన నీతో మాట్లాడరంట్రా?

వీర—మాట్లాడకేంరా. సత్తిరుసిరా! మారాజు! ఓపాలి పొద్దోరే నన్ను ఆరిభానం తెమ్మన్నారు. ఓరి బాబు నచ్చానా మోయడాన్కిదాన్తల్సిగ్గొయ్యా! తాడిశెట్టంత బరువుందిరా! బానాలెలాయేత్తారో గాని.

నాగ—ఆరు దేముళ్లురా? లేకపోతే బకన్న, కిమీారన్న, ఊరంతా మె

లా వచ్చా-రీరి సేతులో ! (అటు నిటుఁ జూచి) ఓరిబాబ దేం ట్రో ! ఆయేపంత గడ్బిడ అవుతావుంది ! దెబ్బలాడ్తున్నారా ఏటి ?

వీర—లేదురా. బామ్మర్లు బోచ్చేంతున్నారు గమోలు ! గోవిందా అంటున్నారు.

నాగ—తింటా తింటా ఎందుకురా అరటం ! తిన్నకూడు అరగడానా ఏటి ?

వీర—కాదురా ? బోంచేత్తూ దేముణ్ని తలత్తున్నారురా భామ్మర్లు.

నాగ—మనం కల్లు దాగ్దారి రారాపోదాం.

వీర—పద మఱి.

(నిష్క్రమింతురు.)



3 వ రంగము.



ప్రదేశము—ఆయరణ్యములోనే యొకపర్ణశాల.

ప్రవేశము—అర్జునద్రౌపదులు.

అర్జు—దేవీ ! అంతవఱకు మే మెఱుఁగమా ? ఇప్పుడు చింతించిన నేమి లాభము ?

ద్రౌప—(విచారముతో) నాథా ! ఆర్య లెఱిఁగియుఁ దమప్రియాభార్య నిట్లు పరిభవక్లేశపాశములఁ బెనవేసి గాసిఁ బెట్టనగునా ?

అర్జు—బేలా ! ఏల నీలీల శూలములఁ బోలు మాటల మమ్ము వ్యథ నొక్కైదవు ? అన్నియు నెఱిఁగిన నీ విట్లనఁ దగునా ?

గీ. ఎఱిఁగియో యెఱుంగకో మను ♦ జేంద్రుఁ డవుడు
జూద మాడంగ సమకట్టె ♦ మేదినిఁ జతు

రంగములతోడ నోడె నీ ♦ శత్రులపరిభ
వంబుఁ గల్గెఁ దుదకు వన ♦ వాస మయ్యె. 16

గీ. కాన నిప్పు డెవ్వరి నన్నుఁ ♦ గార్య మేమి?
పదియు రెండేఁడులును వన ♦ వాసయోగ
మిపుడు కుడువక తీఱునే ♦ యింతిమనకు?

ద్రౌప— మొదటినుండియు నీయోర్పె ♦ ముప్పు దెచ్చె. 17

ఎన్నఁడైన మనదుఃఖము లిఁకఁ దీఱునా?

అర్జు— గీ. పదియుమూఁడేఁడులును గడు ♦ వకయె పోవు
పరమశత్రులతో వారిఁ జం ♦ పకయె పోము
పరిభవక్లేశములను బా ♦ పకయె పోము
ఓపికను బూని యుండు మో ♦ యుత్పలాక్షి! 18

ద్రౌప— గీ. అన్నియును జూడ మనతప్పు ♦ లనియుఁ గాదు
వననివాసంబు సలుపరా ♦ దనియుఁ గాదు
ఘనబలాఢ్యులు మీరు గా ♦ రనియుఁ గాదు
ఇవి తమకు నచ్చలే దని ♦ యేడ్చుచుంటి. 19

అర్జు—(చిఱునవ్వుతో) వెఱ్ఱిదేవీ! మాకు నచ్చలే దనుట మిగుల నవ్వుఁ బుట్టించుచున్నది.

గీ. అగ్నిసాక్షిగఁ బెండ్లాడి ♦ నట్టిభార్య
నొరులు పరిభవింపఁగఁ బతి ♦ యోర్వఁగలఁడె?
పత్నివాతాన నొకతట్టు ♦ బాధనొందఁ
దక్కుభాగంబు సౌఖ్య మం ♦ దంగఁగలదె?

మాకు నచ్చకయే పోయినయెడల నాప్రతిజ్ఞ లెందులకు? ఆసభలో నాయార్భాటంబు లేల? అదియుఁ గాక కుసుమపేశల

మైన దేహ మిట్టి యిక్కట్టుల నొందుచుండ నేమానవునకుం గో
నికరము పుట్టదు? మామనములుమాత్రము సంతోషాంభోనిధి
నోలలాడుచున్న వనుకొనుచుంటివా? (విచారముతో)

సీ॥ మముఁబోలు నరపాల • మణు లోలగము గ్రాలఁ
జాలదీనత భూష • ణాల నూడ్చి
చెలువార పరివార • ములు కేరుచూహసింప
మొగమువంచుక యెంతొ • వగవుఁజెంది
మును లెంతొ దమస్వాంత • ములఁ జింతఁ గన నింతి
వంతఁబడుపరిభ • వంబుఁ జూచి
మనసత్యమును నిష్ఠ • యును వ్యత్యయము గాంచు
నంచు నేమియుఁ జేయ • తప్పుచుండి
తుదకు మాప్రతినలు నోటి • తుంపర లయి
వనములోఁ గడగండ్లయో! • పడుచు నుంటి
మించు వేమాఱు లేడ్చుచు • వంచినమొగ
మించుకైన నెత్తక యుంటి • మింతి! మేము. 21

ద్రౌప—(తనలో) పౌరుష మెక్కించుటకై యనినమాట తుదకు విచారముఁ గలుగఁజేయుచున్నది. చాలు నీపంథ! (ప్రకాశముగా) నాథా! ఏమి యనుకొనిన నేమి లాభము? సుతులను బంధువులనుఁ బ్రాణసమ యగుమాయత్త కుంతీదేవిని విడువవలసివచ్చెఁ గదా యని విలపించుచుంటిని. జగద్రక్షకుం డగునప్పుండరీకాక్షునికటాక్ష మకుయమాటచే మన కేకొఱఁతయు రానేరదు. ఎప్పటికైన నీవనవాసక్లేశము తీఱకపో దని యార్యులే సెలవిచ్చితిరి.

అర్జు—(విచారముతో) ప్రేయసీ! ఎన్నఁటికైన నీయిడుములఁ గడువఁ

గలమా ?

సీ॥ ఏనాఁడు నీగాథ ♦ మైనకానలు వీడి
        వీడుఁ జేరి సుతులఁ ♦ జూడఁగలమొ ?
    యేరోజు వరిరాజి ♦ ఘోరాజి నసిరాజ
        ములఁ జెండి ముదముతో ♦ నలరఁగలమొ ?
    యేప్రొద్దు మముదిద్దు ♦ మాపెద్దలనుఁ జేరి
        కౌఁగలించుకొని సా ♦ కంగఁగలమొ ?
    యేవేళ మముఁ గేల ♦ నిడి బాల్యమునఁ బెంచు
        కుంతీసతినిఁ జేరి ♦ కొలువఁగలమొ ?
    మాప్రతిజ్ఞల నన్నిటి ♦ మఱచిపోక
    యొక్కొకటిఁ దీర్చినీవంత ♦ లుడుగఁజేసి
    నేల యంతయు ధర్మభూ ♦ పాలుఁ జేల
    గాంచి యెప్పుడు మనము సు ♦ ఖించఁగలమొ.        22

ప్రేయసీ ! నిత్యసత్యవ్రతదీక్షాధురీణుం డగుధర్మస్వరూపుఁ డొకండును బకజరాసంధాదిదుష్టరాక్షసశిక్షాదక్ష భీమబలుం డొక్కఁడును తీక్ష్ణేక్షణమాత్రసంక్షుభితవైరిక్షితిపతివక్షోనిర్భేదకులగుతక్కినవారును పరమనిర్భాగ్యులై దురంతసంతాపభూయిష్ఠకాంతారంబులఁ గుందవలసెఁగదా ! హా ! హతవిధీ ! నిన్నే మందును ! మందయానా ! ముకుందచరణారవిందమరందతుందిలేందిందిరులమగు మనకే శుభం బొనఁగూడకున్న నిఁక నే మందును ?

ద్రౌ.—నాథా ! శుభకార్యమునకై పోవుచు నీయమంగళము లేఁ కావున మన కెప్పుడు నాశ్రీకృష్ణుఁడును భక్తవశంకరుం డగుశంకరుంను దక్క నేరును దిక్కులేరు. విచారముమాని ధైర్య

మవలంబింప వేఁడెద.

అర్జు—(ధైర్యముతో) దేవి! యీవిచారములు నీయూరడింపులతో
నేమి? యిఁక నాప్రతిన వినుమా?

శా. గాండీవాఖ్యధనుర్ఘనాఘనగుణ ♦ క్వాణాతిఘోషంబు ప్ర
హ్లాందోద్యద్భ్రమఁ గల్గఁజేయఁగ నిశా ♦ తాజిహ్మగవ్రాతముల్
చండారాతిచమూపతీంద్రరుధిర ♦ స్రావంబుఁ ద్రావింతు మా
ర్తాండగ్లాభతతుల్ గతుల్ విశిచిన్ ♦ దథ్యంబుగా నమ్ముమీ. 23

మఱియు నోదేవీ!

ఉ. కౌరవు లింక నాదువిశి ♦ ఖంబులఁ జచ్చిరటంచునమ్ము; మిం
కోరమణీమణీ! మనసు ♦ నూరకె చింతలముంపఁబోకు బల్
సారము లైనదివ్యశర ♦ సంపదకై శివు వేఁడ ఘోరనీ
హారశిలోచ్చయాటవికి ♦ వ్యాసుఁడు పొమ్మనె నన్నుఁ గూర్మితోన్.

కావున నీమందస్మితసుధాసారంబున నామనస్సునకు సంతసం
బొనఁగూర్చి నన్నిక్కార్యమునకై పంపుము.

ద్రౌప—(సంతోషముతో) సాక్షాత్పరమేశ్వరుఁ బోలినకృష్ణద్వైపా
యనుఁడును కేవలధర్మస్వరూపు లగుమీయన్నగారును మీకా
జ్ఞ నిడ నేనందులకు సమ్మతింపక ముఖము ముడుతునా? మీ
బావ యగు శ్రీకృష్ణుఁడు రుక్మిణిఁ దేఁబోయి పరిపూర్ణమనోర
థుఁడయినట్లు మీరును లబ్ధదివ్యాస్త్రులరై శీఘ్రముగ నాకత్య
తానందముఁ గూర్తురుగాక!

గీ. అమృతభాండంబుఁ దేఁబోయ ♦ నట్టిఖగవ
తంసుమాడ్కి సంజీవిభూ ♦ ధరముఁ దెచ్చు
నాంజనేయుకైవడి నీవు ♦ నస్త్రతతుల
బడసి ముముఁజూడఁ జనుఁగాక ♦ పార్థివేంద్ర! 24

నాథా ! ఆర్య లేదీనురాలిమాట మఱచిపోక శంకరకరుణాసంపాదితదివ్యశరవరులరై దేవేంద్రపుత్రు లగుటఁ దత్సమానవిభవులరై రయంబ రా వేఁడుదాన.

అర్జు—ప్రేయసీ ! ఏమిటి కిట్టు లాడెదవు?

చ. హిమకరుఁ డెప్పుడైనను స ♦ హించునె మించినచంద్రికావియో
గమును? నరుండు చాయ విడఁ♦గల్గునె? మాయను బ్రహ్మ వీడునే?
ద్యుమణి సరోజిని న్విడిచి ♦ యుండగనేర్చునె? యట్లె నిన్ను నే
నిమిసమువీడియుండఁగల♦నే? చెలి ! నిన్మఱవంగనేర్తునే. 25

ద్రౌప—నాథా ! చిరవియోగమునకుఁ జోటియ్యకయే యచిరకాలంబుననే పునర్దర్శన మిచ్చెదరుగాక ! లేనిచో నీతనువు నిలువఁ జాలదుసుఁడీ.

అర్జు—కాంతా ! యక్కాలంతారంబున నువూకాంతు నారాధించుటయైనతోడనే రాక రాకఁబోని నీనగుమొగముఁజిగి యగపడక పడుకుడెందముతో నందందుఁగొందల మందుదునా? శీఘ్రంబ రాఁబ్రియత్నింతును. వ్యాసమహామహుం డుంచినశుభముహూర్తము సమీపించినది. నేనేగెద. ( కౌఁగలించి ) ప్రేయసీ! యీయాలింగనము సంగజుపంపున నీకుఁ గానుక నొసంగితి. ఇదియే నిన్ను నన్ను మఱవకుండఁజేయుఁగాత.

( నిష్క్రమింతురు. )

ప్రథమాంకము.



ఓం

శుభమస్తు.

# పాశుపతార్జునము.

## ద్వితీయాంకము.

### 1 వ రంగము.

ప్రదేశము—హిమవన్నగప్రాంతము.

ప్రవేశము—అర్జునుఁడు సర్వాయుధోపేతుఁడై.

అర్జునుఁడు—(ప్రవేశించుచు)

లయగ్రాహి.

చెల్లరె కనుంగొనఁగ ♦ నుల్లమును నీయటవి
దల్లడిలఁజేయుచును ♦ నెల్లెడల నుండెన్
బల్లవము లగ్రముల ♦ మొల్లముగఁ గుల్కుచును
నల్లశివజూటమనఁ ♦ జెల్లుచు వెలింగెన్
బెల్లుగనుఁ జీకటికి ♦ నిల్లువలె వృక్షముల
నల్లుకొన శాఖలను ♦ మల్లడిగఁ బర్వెన్
మల్లులును నిందుఁ జనఁ ♦ గల్ల యని చెప్పనటు
లల్ల నవె జంతువులు ♦ నుల్లసిలి యార్చెన్. 1

ఆహా! యీకాంతారం బెంతభీకరంబుగ నున్నది! అవిగో!

క్రూరమృగంబులు బలము గలవగుటచే నిచిఱుతమృగంబుల నొక్కమొగిఁ దఱుముకొనిపోయి యనేకవిధంబుల వేధించుచున్నవి. వహ్వా! ఆదెబ్బలులు మున్నగునవి నన్నెంతయుఁ జూడఁ బురికొల్పుచున్నవి. ఈవనం బెంతజంతుసంకీర్ణంబై సంతసం బిచ్చుచున్నది!!!

సీ॥ మత్తద్విరదకుంభ ◆ మాంసానురక్తరౌ
ద్రేక్షణాస్యములుహ ◆ ర్యక్షతతులు
హరిణక్షతజసక్త ◆ హాళహాళాధావద
త్యాగ్రహోగ్రజ్వల ◆ ద్వ్యాఘ్రకులము
సకుటన్నటఘ్ఘోణి ◆ సమ్యక్షనఘ్ఘోణ
ఘుర్ఘురనిర్ఘోష ◆ కోలసమితి
మధుకరప్రోక్షిప్త ◆ మధుసుధాస్రవహర
దిచ్ఛావిహారక ◆ ఋక్షబృంద
గీ॥ ఖంకనితరేతరాగ్రహ ◆ ప్రోక్షణప్ర
నరదతిశితవిషాణప్ర ◆ హారదఖండ
ఘోరవాహద్విషద్వార ◆ మేరికైనఁ
చేఱిచూడంగ రాకుండ ◆ మీఱమేర॥ 2

(కొంచెము ముందునకు నడిచి చూచి) అరరే! ఆపులి కురంగమును కంఠమునఁ గోఱలు గ్రుచ్చి పట్టికొని యవలీల నాఝూరంబు దాఁటుచున్నది. ఛీఛీ! యీపంది దెబ్బఁదిని పాఱిపోవుచున్నది! భళిరే! యీయెనుపోతువ్యాఘ్రమునుఁగొట్టుటకే కాఁబోలు గడువేగముగాఁ గొమ్ముల వంచికొని మీఁదికిఁ బరువెత్తుచున్నది. అయ్యారే! దెబ్బఁ దినియుఁగూడ నూరక నె

అచి నోటనుంటచేఁబోలు నేమియుఁ జేయక పాఱిపోవుచున్నది. చిత్రము ! చిత్రము ! ఆమర్కట మెనుపోతుపై నెక్కి యెన్ని విధములఁ దప్పఁగొన నియ్యక వదలక పై నాడుచున్నది. (కొంచెమూరకొని) ఏది యెట్టులైనఁ బొట్టకుఁ గావలసినది తిని స్వేచ్ఛావిహారము లైనయీమృగంబులకన్న నేరినో కొలిచి స్వతంత్రదూరులై పలుబాములఁబడెడి నరు లేవిషయమున నధికులో తెలియరాకున్నది. ఎందులోను గారు కాని యొకవిషయములో నధికు లని చెప్పవచ్చును.

గీ॥ నోరులేనట్టిజంతువు ♦ లేరినైన
స్తుతులఁ జేయుచుఁ గొంపలఁ ♦ ద్రోయలేవు
నరు లటులగాక యొకరికొ ♦ కరికిజగడ
ములను బెట్టి కొంపలఁ దీయ ♦ గలరు పెక్కు॥ 3

జ్ఞానవిషయములో గొప్ప యనుటకు సుంతయు నాధార మిప్పటికాలములోఁ గానరాదు. ఒకవేళ నధికుల మనినను మాయావిషయికజ్ఞానమందే కాని యిఁక నెందులోను గాదు. (కొంతవడికూరకొని) ఆహా ! యిదియే హిమవన్నగ మని తోఁచెడి. సందేహమేమి ?

గీ॥ భరతఖండమునకుఁ గట్టఁ ♦ బడనికోట
యోషధీవిశేషములకు ♦ నునికిపట్టు
సకలజంతుసంతతికిని ♦ జన్మభూమి
ఋషివతంసుల కిల్లిదె ♦ హిమవదగము॥ 4

ఆహా ! మంచుచఱియలుసూర్యరశ్మిచే నిక్కముగా రజితపర్వతమును ధిక్కరించుచుఁ దమకాంతుల వెదచల్లుచు మిఱుమిట్లు

గొలుపుచున్నవి. భళారే! కళాపూర్ణుఁ డగుసుధాకరుఁడు శంకరునారాధించుటకై యీనగం బధివసించెనో యనునట్లు భూధరం బంతయు మంచుగడ్డలచే నెంతయు రమణీయమై యున్నది. ఇందలి సెలయేఱులును నగమునగము కరఁగిన నీహారశిలాశకలములతోడ నేపాఱుచున్నవి. ఇట్టిచల్లనిప్రదేశము గనుకనే మహామహులగు ఋషీశు లందఱు నిందె చల్లగ నిల్లు గట్టుకొని యుల్లసిల్లిరి.

గీ॥ ఎందఱో మహామహు లగు ◈ ఋషివతంసు
లిచ్చటనె తపములఁ జేసి ◈ యిచ్ఛ ముక్తిఁ
గనిరఁటయిఁక దీనిమహాత్వ ◈ ము నుడువంగ
వశమె వేయిముఖంబుల ◈ వానికైన॥ 5

(కొంచెము దూరము నడచి యబ్బురముతో) ఆహా! యిదేమి? ఈమృగంబు లతిక్రూరంబులయ్యుఁ దమసహజదుస్స్వభావముల విడిచి యన్యోన్యమైత్రిం బొంది కడు వింతఁ గొలుపుచున్నవి.

॥ అరరే! వ్యాఘ్రము లుగ్రభావమును సం◈హారంబుగావించికొం
చరులా లేఁడులతోడ మైత్రిఁ గని యా◈ప్యాయంబుగా నాకెడిన్
వరకంఠీరవ మాకరీంద్రమునకున్ ◈ బద్ధారియైయుండియున్
విరళింబాసెలగాట లాడుచుఁగడున్ ◈ వింతౌనటు ల్కాన్పడున్॥ 6

ఈమృగంబులసొంపు కడు నింపుగా నున్నది. ఏమహాత్మునితపఃప్రభావమున నిట్లుండెనో తెలియరాకున్నది కాని యీప్రదేశము, మున్యాశ్రమ మని చెప్పక తప్పదు. అచ్చటచ్చటఁ బర్ణకుటీరములును నందుపై సన్ననిధూమరేఖలును నిచ్చోటఁ దడి

బట్టలఁ బట్టుకేగిననీటిజాడలును జూడ నిందుఁ దప్పక ఋషులున్నా రని తోఁచెడి. (మఱి కొంచెము నడచి) అయ్యారే! యీనెలవు బహుఫలపుష్పశోభితంబై సాత్వికప్రధానమృగసంకులంబై చిత్తైకాగ్రతదాయకస్థలంబై యున్నయది. నాకు నిచ్చోటే యీశ్వరధ్యానైకచిత్తుఁడ నౌటకు యోగ్యం బని తోఁచెడి.

గీ॥ పెక్కుతాపసు లిచ్చట ♦ నొక్కమొగిని
ముక్తిఁ గనిరి గాన నిదియె ♦ యుక్త మనుచు
దోఁచె నిపుడు నామదికి న ♦ తులమనీషి
వాసదేశము ఘనతను ♦ బడయుఁ గాదె॥ 7

(పరికించి) అదిగో! యెవఁడో మహామహుఁడగు వాచంయమీంద్రుఁ డరుదెంచుచున్నాఁడు. వాని నడిగి దీనిప్రభావముఁ గనుఁగొనెదఁగాక.

(ఇంద్రుఁడు ఋషివేషంబునఁ బ్రవేశించును.)

ఇంద్రు—(తనలో) సర్వబృందారకులకును రాజనగు నాకుఁ బుత్రుఁడనుమాట బూటకము సేయక యీతనిమొగమే సర్వసుగుణఖని యని చెప్పుచున్నది. ఆహా! వీనియస్త్రసంపాదనోత్సుకత యెంతయుఁ గొనియాడఁదగి యున్నది. ఇంక నీతనిమనస్థైర్య మెంతయో కన నగు. నే నితనివికటముగా నిరుత్సాహుఁ జేసి మరల్పఁ బ్రయత్నింతుఁగాక. (సమీపించును.)

అర్జు—మహానుభావు లగుమునీంద్రులకు నమస్కరించుచున్నాఁడ.

(నమస్కరించును.)

ఇంద్రు—వత్సా! సుఖజీవివి కమ్ము.

## ద్వితీయాంకము.

అర్జు—దేవా! యీప్రదేశ మెవరిదై యుండునో?

ఇంద్ర—వత్సా! యిది తాపసాశ్రమము. ఇందు వేటకై వచ్చితివా?

అర్జు—

చ॥ అతులితబుద్ధి నీచమృగ ♦ యార్థము కానకు రాఁగలేదు పా
ర్వతివిభుఁ డైనయల్లశివు ♦ పాదకుశేశయయుగ్మమందు నా
మతిమధుపంబుఁ జొన్పి యన ♦ మానదయామకరంద మొందిసం
తతపరిపూర్ణసంతసము ♦ నఁ జెలఁగన్ జనుదెంచితిఁ మునీ! 8

ఇంద్రు—(వికటముగా నవ్వి) సేభాష్! నీచరిత్ర మతివిచిత్రముగా న్నదే? వేటకై తగినవేషధారివై విశ్వేశ్వరు వేఁడుటకు వచ్చితి నంటివి. అట్లయిన నీబాణ మెందులకు నీకవచమేల? ఆవచ్చిన దేవునిఁ జావఁగొట్టెదవా యేమి?

అర్జు—హరిహరి! (చెవులుమూసికొని) పాపము శమించుఁగాక. స్వామీ! క్షత్రియుఁడ నౌటచే నట్టివేషము దాల్చితిఁ గాని మీ రనినంతపనిఁ జేయ నాతరమా?

ఇంద్రు—ఓహో! క్షత్రియుఁడవా నీవు? అగునైన విశ్వామిత్రుఁడ వౌదువు కాఁబోలు!

అర్జు—విశ్వామిత్రుఁడ నౌటకు నాకట్టి మహత్త్వ మెక్కడ స్వామీ?

ఇంద్రు—విశ్వమున కమిత్రుఁడవు కానప్పు డీబాణంబు లేల విల్లేల?

అర్జు—బాణవిషయమై నాతపము కాన నీబాణములును గైకొంటి నిందుఁ దప్పే మున్నది?

ఇంద్రు—సరిసరి. బాణవిషయమై తపమేమి? నిర్దయఁ గోరినకుంభకర్ణునిపగిది నేదియేనిఁ గోరఁదలంచితివా యేమి?

అర్జు—స్వామీ! యుద్ధక్షేపింపకుఁడు. శరసంపాదనకై తపస్సాచరింప

రాదా?

ఇంద్రు—ఓహో! ధనసంపాదనకై పుణ్యక్షేత్రముఁ జేరునట్లు శరసంపాదనకై తపం బాచరింతువా? చాలుఁజాలు! తప మిట్లైహికసుఖంబులకు వినియోగింప నగునా?

అర్జు—ఈశ్వరధ్యానమైహికాముష్మికోభయఫలప్రదం బౌనపుడు నా యుద్యమం బేల సదుద్యమము గాదు?

ఇంద్రు-కేవలతుచ్ఛైహికేచ్ఛాదుర్గంధుండవైన నీకట్టిది సిద్ధించుటెట్లు?

అర్జు—స్వామీ! శరసంపాదనానంతరము శత్రువుల నిర్జించి దుర్జయంబైన రాజ్యం బధిష్ఠించుట సుక్షత్రియుల ధర్మంబని స్మృతులొక్కటియై నడచుట లేదా! అట్టిచోఁ దుచ్ఛైహికేచ్ఛ యెట్లగు?

ఇంద్రు—ఓహో! శరసంపాదనయే గాక జీవహింసాగ్రగణ్యం బైన యుద్ధం బొనరించి నరబీజంబుల నిర్మూలింప నుంటివా? చాలుఁ జాలు. నీ కిది సమంజసం బని యెవరు చెప్పిరి. జీవహింసాపరాయణు లగుమీరాజుల వృత్తము లెప్ప డిట్టులే!!

గీ॥ రణము లోకనితో నొకరుఁ డూ ♦ రకయె నలుప
జనుల హింసించి ధనమును ♦ సంగ్రహించి
మూలమూలల నుండిన ♦ మూఢనరుల
రాఁగఁ బంచి చంపెడిధరా ♦ రమణు లెవరు? 9

అట్టినీకు జగచ్ఛంకరుం డగుశంకరుండు కటికవానికిఁ గఱకుఁగత్తినిబహూమతిఁ జేయురీతి శరము లిచ్చునా? కల్ల! కల్ల! పో పొమ్ము! ఊరక శ్రమపడక యధావిధి నింటి కనుగమింపుము. పలువుర బాధించి బ్రతుకునీ వేడ భక్తముముక్షుహృదయారవిందభృంగుం డగుగంగాధరుం డేడ? పోపొమ్ము.

అర్జు—మునిజనాగ్రణి ! దుష్టశిక్షణ మవశ్యకర్తవ్య మని మీబోఁటిపెద్దలవలననే విని యట్టికార్యమున కొనఁగూడఁదగిన యస్త్రములఁ గోర నున్ననన్ను దుష్టజనశిక్షాదక్షుండగు నిటలాక్షుఁ డేల కటాక్షింపఁడో క్షమించి తెలియఁజేయ వేఁడెద.

ఇంద్రు—నీవు శిక్షింపఁదగిన దుష్టజను లెవ్వరో ముందు నుడువుము. తరువాతఁ జూచెదము.

అర్జు—ఎవరినో యన నేల? మమ్ము సకలపరిభవక్లేశముల ముంచి నిండుకొలువున మావనితవలువ లొలిచినదాయాదులే ముందు శిక్షార్హులు.

ఇంద్రు—దాయాదులకొంప ముంచుటకే యుంటివా? నాయనా! పాపము వార లేమి యొనర్చిరి! క్రొవ్వి జూదమాడి యంతయుఁ గోలుపోయి తుదకు వనవాసులై మీరలే తెచ్చుకొనినదాని వారిమీఁద నేల పడవైచెదవు? పోని మ్మెద్దియో యొకటి జరిగినది. మీభార్యను బరిభవించుచుండినప్పుడీక్షాత్రమెక్కడకుఁ బోయినది? ఇట్టియధర్మాచరణపరాయణులగు పిఱికిపందలకు నాశూరుడగు శూలపాణి కరుణించి యస్త్రముల నిచ్చునా? ఈయడియాసల మానుకొనుము. చనుము.

అర్జు—క్షమింపవేఁడెదను.

గీ॥ ద్యూతములు పాతకము లయ్యు • నుర్వి ధర్మ
విదులు రాజులు పిల్వ రా • వీలు లేద
టంచు నుడువ రా దని వచ్చి • యుంచి రటుల
వనితఁ బ్రోవఁగ సత్యంబు • వదలి పోదె? 10

ఎట్టియిక్కట్టులఁబడియైనను సత్యపాలనమే మాపనిగాన నట్లు చేసితిమి.

ఇంద్రు—(తనలో) ఆహా! వాక్శుద్ధి యిప్పుడ యెంతయుఁ గొనియాడఁ దగి యున్నది. దీనికిఁ దోడు సమయస్ఫూర్తియు నుండె నిఁక వీ నిమనస్థైర్యమునకుఁ గొఱంత యేల కల్గును. అయిన నిట్లని యెదఁగాక. (ప్రకాశముగా) యేది యెట్లైనను నీకు శివుఁడు సాక్షాత్కరించి నీకోరినవరంబు లీవలెఁగదా! ముక్కుమూసి కొనునంతమాత్రమునఁ దప మగునా? ఒకవేళ నట్టిది నీవు ప్రారంభించినను ఏయింద్రుఁడో వచ్చి నిన్నుఁ జేయనిచ్చునా?

అర్జు—స్వామీ! ఇంద్రుఁ డేల వచ్చును? అదియుఁగాక తండ్రి యగు నతఁడు నన్నే భంగపఱచునా? పిల్లలఁ దినుట కతఁడు పెద్దపులియా? పుత్రమోహంబును సహితము వీడుటకు నే నతనిపద విఁ గోరితినా?

ఇంద్రు—(తనలో) ఇఁక నేఁ దడయఁజాల (యథారూపమునుఁబొంది) (ప్రకాశముగా)

గీ॥ నాకుమార! రార! నరగ ◆ నాదుసూన
రార! బిగికౌఁగలియ్యవ ◆ దేర? నాదు
పదవిఁ గోరిన నే నీయ ◆ భయముఁ జెంద
నేర? నాకంబు నీదియం ◆ చరయఁగదర! 11

(అనికౌఁగలించుకొనును.)

అర్జు—సర్వసుపర్వప్రభువులు నాతండ్రులు నగు దేవరకు సూనుఁడు వినయపూర్వకసాష్టాంగనమస్కార మాచరించుచున్నాఁడు.

(అట్లుచేయును.)

ఇంద్రు—లేలెమ్ము! వత్సా! (లేవఁదీసి) నీమనస్థైర్య మరయఁగోరి యింతవఱకుఁ దెచ్చితిని. నీపాశుపతాస్త్రసంపాదనోత్సుకత వినియే యిటువచ్చితి. ఇదియే యర్హమైనప్రదేశము. శివోపాస

నోపదేశక్రీపం బంతయుఁ జెప్పెద ర మ్మానదీతీరమునఁ గృత స్నానులమై యథార్హకృత్యముల నిర్వర్తింతము.

అర్జు—చిత్తము. వారుగో! మునిబాలురు కొందఱు నదీతీరంబునకై పోవుచున్నారు.

(నిష్క్రమింతురు.)



2 వ రంగము.



ప్రదేశము—ఆయరణ్యమే.

ప్రవేశము—ఒకమునిబాలుఁడు కెవ్వుమని నవ్వుచు.

మునిబాలుఁడు—(పెద్దగొంతుతో) చిత్రము. చిత్రము. అతిచిత్రము! హాహాహాహా! (పెద్దపెట్టుననవ్వి) వహ్వా! యిది యెప్పుడును నా తాతముత్తాలతాతలైనఁ జూచి యెఱుఁగరు. (చిఱుగంతులు వైచుచు) చంకదుడ్డు! చంకదుడ్డు! వహ్వా! (మఱల మఱల నవ్వుచు) అన్నయ్యా! అన్నయ్యా! చంకదుడ్డు! చంకదుడ్డు! (అనిపిలువఁగానింకొకమునిబాలుఁడు ప్రవేశించును.)

2 వ బా—తమ్ముఁడా! ఏల యీలీల వెఱ్ఱివానివలె నటించుచుంటివి? చంకదుడ్డేమిటి నీమొగము? మనగురువుగా రింటలేరనియా యీయాటలు?

1 వ బా—అన్నయ్యా! నవ్వు! నవ్వు! నవ్వవేమి? చంకదుడ్డుసామి దండము. చంకదుడ్డుసామీ! దండము. (అని పొట్ట పగులున ట్లు నవ్వును.)

2 వ బా—తమ్ముఁడా! నవ్వుమని నన్నుఁ బ్రేరేపించెద వేటికి? నవ్వొ రక వచ్చునా? అదియుంగాక నీకావెఱ్ఱినవ్వునకుఁ గారణమేమి?

1 వ బా—ఓరి వెఱ్ఱియన్నయ్యా! యీసంగతి వినలేదా! చంకదుడ్డు సామీదండముమునీశ్వరుఁడు వచ్చినాఁడురా! నీవు చూడనే లేదా యేమిటి? అతనిప్రభావమే కాదా యిటుల వెలుఁగుచున్నది? మనగురువుగారు మొదలగుగడ్డాలమును లందఱు వెండికొండకో పరువు లెత్తి రని వింటివా?

2 వ బా—(యించుక నవ్వి) ఓరిపెంకిదిప్పకాయా! అయ్యర్జునినా యధిక్షేపించుచుంటివి! నీతెలివి కాలినట్లే యున్నది. వాఁడు సామాన్యుఁడు కాఁడుసుమా?

1 వ బా—అతఁ డెంతటివాఁడో నే నెఱుంగుదు? చంకదుడ్డుఁ బెట్టుకొని సామీ దండ మని జపముఁ జేయు బూఁడిదబుస్సన్న.

2 వ బా—వెఱ్ఱివాఁడా! యిట్టియపార్థములఁ బల్కితివా యెవరిచేతనో యొకరిచేత దెబ్బలు తప్పక తినెదవు నోరు మూసికొనుము.

1 వ బా—దెబ్బలు నేను దినను కాని యీదొంగముని యీదేవునిచేతను నీవు నాచేతను దిందురు. పెద్దవాఁడవై యుండియు శబ్దమంజరిఁ జదువుచుంటివికదా యని యన్న యనిపిలిచినందులకా యీగర్వము?

వ బా—నేను శబ్దమంజరి చదువుచుంటి నని ధిక్కరించితివా? నీవేమి తగులవేసితివి? పండ్రెండుసంవత్సరములనుండి బాలరామాయణము ప్రథమశ్లోకమే కాదా! సిగ్గు లేక యిట్లు పేలకు. నోరు మూయించెదను.

1 వ బా—ఓహో! పిలక పైకు దిరుగుచున్నటు లున్నది. చెంప నర్ధచంద్రాకారముచే శుద్ధిఁ జేయవలెనా యేమి?

2 వ బా—ఓరి బ్రహ్మచారీ! నీపేరూరక పోనిచ్చుకొంటివికావే?

1 వ బా—అహాహా! గురివింద తనముడ్డిక్రిందినలుపెఱుఁగదఁట! నీవు

గడ్డాలు మీసాలు నెరసిన బ్రహ్మచారివే! అయిన నీవు ముసలి పండు క్రోతివి కాఁబోలు.

2 వ బా—మనగురువుగారు రానిమ్ము నీపని పట్టించెదను.

1 వ బా—ఎప్పుడు నాపని పట్టె నీపని మట్టె గురువుగారు రానిమ్ము నేనుఁ జెప్పెదును.

2 వ బా—నీ విప్పుడు చెప్పు! నాది యేలాగు పప్పే!

1 వ బా—అమ్మ నీబుద్ధి కాల! యేలాగైనఁ బప్పులో నడుగు వేయుచుందువు. మా పెద్దన్నయ్యవు నే నెఱుఁగనా? యీ బుద్ధి యంతయు నీతలలో లేదు. నిన్నుఁ జేసిన మట్టిలో నున్నది. అబ్బ నీ చాకచక్యము! శబ్దమంజరిలో శ్లోకములు నీవే పెట్టవలెను.

2 వ బా—నీకొఱకు శ్లోకములు పెదుదును గాని గురువు రెక్కడ కేగిరి?

1 వ బా—మన దొంగముని ప్రభావ మంతయు నీనగముఁ జుట్టిముట్టి సహింపలేక మనవార లెవ్వరితోడనో మొఱ్ఱపెట్టుటకుఁ బోవి పోయిరి.

2 వ బా—ఈశ్వరునొద్దకే పోయియుందురు.

1 వ బా—అమ్మ! నీబుద్ధి కంతము లేదుసుమా. కాకి యొక్కటే నీతో సరిపోల్పఁబడఁదగినది.

2 వ బా—నీబుద్ధి కేమి లెమ్ము. మంచి వెలుఁగుబంటిబుద్ధి.

1 వ బా—మనబుద్ధులు రెండు కొంచెమించుమించుగా కుక్కబుద్ధులే! చాలు దెబ్బలాటలు గట్టిపెట్టుమిఁక.

(అంత నేపథ్యమున) కోహో! హూాత్! యేమెయ్యారా! చూచెద వేటికి? (అనిమఱలమఱల వినఁబడును.)

1 వ బా—(చూచి) ఓరియన్నయ్యా! వారెక్కడి యొఱుకులో చూ

ఊచూడు! వారియాకారము.

సీ॥ జుంజురువెండ్రుకల్ ♦ చూడనేని వ్రేలి
నల్లజాతిని బోలు ♦ నల్లని మెయి
బుగ్గమీసంబులు ♦ పొడుగైన యొడలును
నాపాదశిరమును ♦ నలరుబొచ్చు
గురివెంద పేరులు ♦ చెరలాట మాడంగ
వక్షంబు చఱిఁబోలి ♦ వఱలుచుండఁ
బట్టెడునామంబు ♦ బిట్టుమోటగుమాట
కొండలదరిడుబల్ ♦ బండనడక
మొలకునూత్రిపు యాకుల ♦ వలువఁ గట్టి
చేత విల్లును బాణము ♦ ల్చెలఁగుచుండ
నెంతభీకరమృగమేనిఁ ♦ జింతఁగొనక
వేఁటలాడుచు వచ్చిరి ♦ యాటవికులు॥ 12

ఓరిబాబో! వీరిదేశపుబోయలు కానటుల దోఁచుచున్నది. చూడుము.

సీ॥ కనఁబడ్డమెకములఁ ♦ దనబాణహతిచేతఁ
గ్రిక్కురుమనకుండ ♦ నుక్కడంచుఁ
బెనుగొండలను జీల్చు ♦ నెనుపోతుఁగొమ్ములఁ
బట్టిపాఱఁగ వైచి ♦ ప్రాణమూడ్చుఁ
దనముట్టెతోడుత ♦ వని బుడ్డగించెడి
పందిమింటికి నేసి ♦ బలువుసూపు
మృగరాజనఁగనొప్పు ♦ మేటియాసింగముఁ
వాలంబుఁ బుచ్చుక ♦ లీలఁద్రిప్పు
నెక్కడియెఱుకులో కాని ♦ నిక్కముగఁ బి

శాచగణమట్టులే యుండి ♦ జంతువులను
బీకి దినుచుండి కేటికీ ♦ భీతి రమ్ము
పోద మెటుకులు నీదారిఁ ♦ బోదు రరుగ॥ 13

ఓరి అన్నయ్యో! వాఁ డెవఁడు యమునిఁ దన్నినవర్చస్సుతో నున్నాఁడు? వీరంతశుద్ధపశువులవలె నున్నారేమిరా? రమ్ము మన కేటికిఁ బోదము.

వ బా—ఆమె యెవతెరా? నిక్కముగాఁ బర్వత మంత యున్నది. ఓరి నీవనినట్లు నిక్కముగా నాదొంగమునిమూలముననే యివి యన్నియు బయలుదేరినవి. రమ్ముపోవుదము.

(నిష్క్రమింతురు.)



3 వ రంగము.



ప్రదేశము—ఆయరణ్యమే.

ప్రవేశము—సమాధిస్థితుఁడగునర్జునుఁడు.

అర్జు—(నిమీలితలోచనుఁడై) జయశ్రీలోకశంకరా! భక్తవశంకరా! దుష్టనాశంకరా! మాంరక్ష! మాంరక్ష! మాంపాహి! మాంపాహి!

(శంకరపార్వతీనారదభృంగులు కిరాతవేషధారులై ప్రవేశము.)

శంక—దేవీ నీవేషము బాగుగా నీకుఁ గుదిరిన దని నాయభిప్రాయము.

పార్వ—(చిఱునగవుతో) నాధా! నాకు నీవేష మొప్పటియే కాదు. నాపూర్వస్థితిని జ్ఞప్తికిఁ దెచ్చి మఱింతమీఁకు దర్శనీయముగ నున్నది.

నార—అమ్మా! పూర్వపుదినములఁ దలఁచుకొనిన నెవ్వరికైన నొక్క-

విధమయినయానందము వుట్టికమానదు.

శంక—వత్సా! నారదా! ఈముద్దుబాలకై నాపడినపాటు లీభృంగికే తెలియును.

పార్వ—నాపడినపాట్లార్యులెఱుఁగరా?

నార—అమ్మా! లోకమాతలలో నగ్రగణ్యవైననీవు నీపతికై పడినపాట్ల నే నెఱుఁగనా?

శంక—నారదా! మన మిప్పటినుండియు నెఱుకలయానమాట లాడవలెఁజుమా!

నార—చిత్తము.

అర్జు—పశుపతీ! లోకాధిపతీ! ఓనగజాతాపతీ! జితరతీపతీ! నాకు నీవేగతి.

చ॥ ఎఱుఁగ నొకించుకేనియును ♦ నృత్యముఁ జేయుట భూతజాతి నాఁ
బరఁగెడునీజనంబువలె ♦ మాంసము నింత దినంగలేను నే
నరుఁగఁగఁజాల నొక్కయెడు ♦ గైన శ్మశానమునందు రాత్రులన్
బరువడి నెట్లు ప్రోచెదవొ ♦ భారము నీయదినమ్ము శంకరా! 14

నార—దేవా! వింటిరా యాతనివినయోక్తి? రాత్రుల శ్మశానములందుఁ దిరుఁగలేడట. ఏమియుఁ జేతఁగాదట.

శంక—వత్సా! ఈతఁడు కడుంగడు భక్తుఁడునుమా! ఈతనిఁ బ్రోచుటకైకదా యిట్టికపటవేషధారి నైతిని?

పార్వ—చాలుఁజాలు. నాథా! భక్తులఁ బ్రోచుట కిట్టికాపట్యముఁ బూననగునా?

శ—ఓసీ! వెఱ్ఱిపార్వతీ! నే నించుక యాతనిధైర్యముఁ గనఁగుతూహలుఁడనై యిట్లు చేసితిఁగాని యాతనిమోసపెట్టుటకుఁ గాదు. నే నాతనియభీష్టముఁ దీర్చుటకే వచ్చితి.

గీ॥ అతనికోర్కు లందరికోర్కు • లిట్లగావు
భువనరక్షణమొనరింపఁ • బూనివరము
గోర్వనైయుండు నీతని • ధీరతయును
స్థైర్యమునుగాంచఁగర్తవ్య • కార్యమిపుడు

(అర్జునుజూపించి)

మ॥ కనుమీ యాతనినిష్ఠలున్ మనలకై • కావించునాప్రార్థనల్।
మనమే యాతనిఁబ్రోవకున్నఁ దగునే • మానుల్వినన్నవ్వరే?।
యనుమానంబిసుమంత బొందఁబనిలే • దాసద్గుణున్ మాన్యునిన్।
మనమీక్షించినతోడనే మనమున • న్నాత్రనింతమోహాసినీ!॥

(భృంగికైచూడ్కినిగిడించి)

భృంగీ!ఇప్పుడుపోయి

ఉ॥ భీకరసూకరాకృతిఁ • వేగమె తాలిచి ఘుర్ఘురధ్వనిన్।
నీఁకజగంబులన్నియును • బీటలువారఁగఁజేసి ప్రకటన్।
స్తోకబలాన్వితంబులయి • సొంపగుదంష్ట్రలఁ జెట్లజీకుచున్।
దాకుచువాని జెందముచ్యు • తస్థిరతన్ బహుధాచలింపఁగన్॥

భృంగి—— చిత్తముస్వామీ! (అనినిష్క్రమించును)

నార—— (తనలో) ఇప్పటివరుసఁజూడ నాకును గొంచెము భోజనముల వహనల్లేయున్నది.

శంక—— కాంతా! నీచిన్నతనంబున నభ్యసించిన భాషనుపయోగింప నవసరము వచ్చినదిసుమా

పార్వ—— (చిరునవ్వుతో) నాథా! చిత్తము. ఆఁ- తప్పు!తప్పు! నాథాయనునది సంస్కృతమైనది. ఏలికాయని పిలువవలయు దయజూడ వేఁడెద.

(అంతనొక్కసూకరము భీకరముగా నార్పుచుఁబ్రవేశించును)

ద్విరదగతిరగడ

నార — అబ్బురముగొల్పుచును ◆ నాపజ్జఁజనుఁబంది।
పార్వ — గొబ్బునను మీరిపుడు ◆ గూల్పఁదగు ముదమునఁడి॥
శంక — ఏమూఢుని దేకనుము ◆ యేపైనకోలలను।
మాయురే! దీనినిఁక ◆ ఘూయింప నేలలన!॥
నార — ఓహోహోయటుజూడుము ◆ దూసలనుదప్పికొనె।
పార్వ — సాహసముతోడనది ◆ సాపుగను బాఱిచనె॥ 18

శంక — (ఆశ్చర్యముతో)
హాయపచారము. అరరె! పడతి ◆ యురయుమట్లు।
పరువిడెనది ◆ నరునిపట్లు॥

(పందియర్జునుపైఁబడఁబోవును)

అర్జు — (కనువిప్పి) చాలు వాగు ◆ సరగబడి!।
కోలవైచి ◆ కూల్తుబొంది॥
శంక — (సమీపించి) ఏలకూల్తు ◆ వేకలంబుఁ।
గోలడెనది ◆ గోమృగంబు॥
అర్జు — (ధైర్యముతో) ప్రాణములను ◆ బాపనున్న।
దానిఁగూల్తు ధర్మమెన్న॥ 19

(అని బాణమేయఁబంది యద్దానితో నదృశ్యమగును)

అర్జు — (తనలో) ఆహా! యిది మాయాసూకరమట్లు కన్పట్టుచున్నది వీరు నెవ్వరో దివ్యపురుషులట్లు దోఁచెడిఁగాని నీచాటవికులుగ దోఁచరు. (ధైర్యముతో) కానున్నది కాకమానదు వుండెదె దులకీచింత! ధైర్యమే సర్వకార్యసాధనముకదా!

శంక — ఓయీ! దొంగమునీ! నాయూనదెబ్బఁదిని పాఱినపందిని గట్టితివేటికి!

జాలమురా? చూడుమిదె ♦ దక్కనిశరంబుల్

(అని బాణము వేయును)

అర్జు——చాలను బ్రతాపములు ♦ సాకెడినివేనా ।

వ్యాళములఁబోలెడివి ♦ పాశుగశతంబుల్ ॥

(అని బాణము వేయ శంకరునకుఁ దగులకే యదృశ్యమగును)

అర్జు——ఆశ్చర్యముగాఁ (దనలో)

ఉ॥ బాణము వేయు కౌశలము ♦ భగ్నము జెందెనొ గాండివంబునా ।

పై నిదయన్దొలంగిశర ♦ వారములుర్వఁగ జేయమానెనో ।

మానితుఁడీవ నాటుఁడుర ♦ మారమణుండొ ననుఁదయార్ద్రతన్ ।

గానఁగవచ్చు శంకరుఁడొ ♦ కానిశరంబులదృశ్యమయ్యెఁగా ॥ 22

(ధైర్యముతో) ఎవరైన నెట్టులైనఁగాని మ్మునాక్షత్రియైకభూషణంబగు ధైర్యము వీడ రాదు (తూణీరములలో బాణములు లేకపోవుటసూచించి తనలో) అయ్యో! యిదేటికి? అక్షయంబులగు మత్తూణీరంబులు బాణహీనంబులయ్యె నిక్కముగా నీకొండు దివ్యపురుషునిగాఁదో చెడి నెవరైనను ఏదిపోయినను వెనుకకంజ వేయనగునా? (ప్రకాశముగా) ఓరీ చూడుమిప్పుడనిన్ను గట్టలబట్టించెదను. కొండద్రిమ్మరివైననీవిప్పుడ పక్కకొరిగి తపెసుమా! (అనిగాండీవము విసరును. అదియదృశ్యమైపోవును గదనువిసరును తుదకన్నిసాధనములు నిట్టే యదృశ్యమగును) (తనలో) ఎన్నిపోయినను దేహమున్నదికదా! ప్రాణమున్నంతవఱకు ధైర్యమువీడరాదు (ప్రకాశముగా) ఓరోరిమాయలమారి! నాయాయుధములెల్లఁ బోయినవని చంకలెగురవేయకుము అశనిపాతంబులఁబోలు నాముష్టిఘాతంబులఁ జవిఁజూడుము (అనిమీఁదఁబడికొంతతడవు పెనగులాడిమూర్ఛఁజెందును)

శంక — (అమితానంద పరవశుఁడై పార్వతితో ప్రసన్నుఁ జూచి)

ఉ॥ కంతుశరంపుతమ్మిపొలి • కంటిరో! కంటివె! యోగసుందరా!
కాంతుఁడుపంత మొందితన • గాండివముఖ్యసుసాధనంబులన్।
వింతనదృశ్యమొందినను • వీఁకనపక్రపరాక్రమాఢ్యుఁడై।
యెంతయునన్నుమార్కొనెన • హీనమనోవిభవానుభావుఁడౌ॥

ఆహా! యితని ధైర్యము! కాంతా! మనకిఁక నీకాంతారసంచా రకులవేషంబుల తోనేల యథారూపంబులఁ బొందనగు

(నారదాదులు యథారూపులగుదురు)

శంక — (అర్జునునిఁ బైఁదట్టి) వత్సా! లేలెమ్ము.

ఉ॥ ధరణిని నిన్నుఁ బోలునరు • దారథరాధర ధీరులేరు తే।
రరసినయంత మేరఁగను • మప్పటియాగమహానాటకోటిజే।
రిఁ ప్రమథాళిగానుమన • ఁ౦చిన శంభుఁడనైతి నేను నే।
వరముగ గంగనిచ్చెదను • పార్థివ! కోరుమి నన్ను నిప్పుడే॥ 24

(చేయూతయిచ్చి లేవదీయును)

అర్జు — (లేచియమితానందాశ్చర్యనిమగ్నుఁడై బద్ధాంజలియై నిలచి)

దండకము:— శ్రీమన్మహాదేవ దివ్యప్రభావా! ననున్గావలేవా
యుమాలోల! వ్యాళాళిమాలా! సురాళిందహింపం
గనే తెంచుహాలాహలంబింతలోఁ ద్రాగఁగాలేదె? నా
మీఁద నీదాదయేయున్నదంచిందాదటన్ జిహ్మఁగాఁ బాద?
పాపంబుఁ బాపంగనేఁబైన నీపాదపుష్పంబుఁ బ్రార్థింతునన్ బద్ధ
హస్తుండనై నిస్తులార్తిన్ జపింపన్నిలింపానుకంపా!
యనంగాంగభంగా! శుభాంగా! కృపాంగా! చు గంగా
ధరా! యీధరన్ భూధరప్రాతమందున్ ఘనంబైన
మోసంబు జన్మించె నోర్వంగ లేనింక దారిం దయన్

జూపిఁగావవ్వలెఁ నన్ను దాసానుదాసుండ వేసారియో
సారె నీగాసినుంగాంచఁగాఁగ నిల్చితిఁ బ్రోవుమీ నన్నుఁ
దుభక్త్యన్నమస్తే నమస్తేనమః॥ 25

(శంకరునకు సాష్టాంగ నమస్కారమాచరించి పార్వతితో)
అమ్మా! పార్వతీసతీ! భవత్పుత్రుఁడు నమస్కరించుచున్నాఁడు (అటు
లచేసి నారదునితో) నారదమునిపుంగవా దాసుఁడు కేలుమోడ్చుచు
న్నాఁడు (అట్లుచేసి బద్ధాంజలుఁడై నిలచును)

శంక — వత్సా! నీవుగోరెడి వరంబు నేనొసంగుదు నీకొకనిశత్రువులే
కారు నీచతుర్దశభువనంబులంగలుగు సురాసురకిన్నర కింపురు
షాద్యఖిల జీవులును వశంవదులవుదురు. వేయు నేలనాకంటెను నీ
వు వేయిమడుంగులు బలుండవౌదువు. మఱియు

గీ॥ అస్మదస్త్రసంతతి నెల్ల ♦ నతిసుప్ర
భాభరాయిష్టమై ట్టు ♦ పాశుపతము
నిచ్చెదివిదిగో! కైకొను ♦ మిపుడ తత్ప్ర
యోగవిధినుపసంహార ♦ యుతముగాఁగ॥ 26

అర్జు — ధన్యోస్మి! ధన్యోస్మి (అనికైకొని నమస్కరించును)

శంక — (పిలిచినగవుతో) నీపోయినసాధనము లన్నియు నాయందలీన
మైనవి. కానినీకొసంగెదఁ దీసికొనుము

అర్జు — రక్షింపఁబడితిని (తీసికొనును)
(అంత నాకాశమునుండి శంకరార్జునులపై బుష్పవర్షము త
రువాత)

మ॥ భళిరే! కంటిమిటుట్టి వింత లెపుడుకో ♦ భక్తాగ్రిగణ్యుండవా!
యళికాక్షుంగరశాత ఘాతతతుల ♦ త్యంతామృతంబొంగా!

నలయం జేసి వరంబు పాశుపతది ♦ వ్యాస్త్రంబుగాఁ బొందితీ।
యిలలో నీకుసమా నమానవులు లే ♦ రేరుంగనన్ బార్థివా॥ 27

క॥ భక్తులఁ బ్రోచుటయందా।
నక్తుండవగుదు నిజంబు ♦ శంకర! చాలన్
రక్తార్ద్రితనుఁడవయ్యును।
భక్తునకీతనకిఁ బాశు ♦ పత మొసగితి వే॥ 28

(దేవదుందుభులు మ్రోగును)

శంక.—కుమారా! దేవతలందరు నీవలన నొకకార్యార్థులై మింటనలంకరించిరి. నాకుఁ దడవయ్యెనేఁ బోయెద. ఏరికిని సురనికరంబ వశ్యపూజ్యంబని నమ్ముము.

అర్జు—అనుగ్రహింపఁబడితిని (అనినమస్కరించును)

శంక—సర్వాభీష్టసిద్ధిరస్తు.

పార్వతి—(నమస్కృతి నందుకొని!) వత్సా! దేవేంద్రవైభవము బొంది సర్వసుఖంబులనొందుము.

నార—(కేల్మోడ్పులందికొని) అర్జునా! తండ్రిలమాటఁ జెల్లించిన శ్రీరామునిభంగి ననంతకళ్యాణ గుణోపేతుఁడవగుము.

(శంకరాదులంతర్ధాన మొందుదురు).

అర్జు—ఆహా! శంకరుని కరుణాతిరేకము గొనియాడ సురలకునునలవి గాకపోయెనిఁక నేనెంతటివాడ!!

గీ॥ భక్తపురుషులపాలిటి ♦ పారిజాత।
మార్తులకు నాకృతిని జెంది ♦ నట్టిరక్ష।
దీనులకయి పుట్టినయట్టి ♦ దిట్టజెట్టి।
వర్ణనము జేయఁగలమె? ద ♦ యార్ణవుశివు॥ 29

ఆహా! నాపుణ్యంబేమని చెప్పుదు? మునిజనహృదయా గోచరం

డగు నీశ్వరుఁ గన్నులారఁ జూడఁగలిగితి. (అని యేదియో యాలోచించిపై (జూచి) ఆహాహా! ఇదయేదో రెండవ మార్తాండుఁబోలి యొకతేజఃపుంజముగాన నగుచుండె.

గీ॥ దివిజుల భవునకంపిన ◆ దివ్యయనఁగ।
భీకరాటవినను దేల్బ ◆ వెలుఁగనంగఁ।
గళఁదుఱఁగలించుసుధతోడి ◆ కలశమనఁగఁ।
తూరుపున లేచె సూర్యుని ◆ తేరుఁబోలి॥ 3

ఆహాయిపుడెంతయు నాకాశము రమణీయముగానున్నది

గీ॥ పశ్చిమాశావనితఁ జేసు◆ భానుఁజూచి।
యంబుజాతా లలనలుభ ◆ యంబు,జెందు।
ననుచు బ్రహ్మ బంపిన కైత◆ వార్కబింబ
మనఁగఁజనుదెంచెడిఁహాహా◆ యా వెలుంగు॥ 31

(పరికించి) ఓహో రాను రానునాదగ్గరకే వచ్చుచున్నట్లున్నది ఇది యేదియొ యుండునోకదా! (పరలఁబరికించి) ఇదియొకదివ్యరథముగాఁదో,చుచున్నది. కనుఁగొనెదఁగాక

(అంత పైనుండి మాతలియింద్రరథముతోఁ బ్రవేశించును

మాత— పాండవమధ్యమా! అర్జునా! అఖండసారథినగు మాతలి నేనమస్కరించుచున్నాను

గీ॥ అసురసంఘంబు దోలంగ◆ నమరనాయ।
కుండధివసించు రథమిది◆ చండగతిని।
బాశుపతము నొందినపుత్ర◆ వరునినిన్నుఁ।
దోడి తెమ్మని నీతండ్రి◆ నేఁడుబంపె॥ 32

అర్జు— నిర్జరనాయక సారథినిగుమాతలి నీకుస్వాగతము. వనవాసబద్ధుండగు నేనెట్లిప్పుడ క్కడకు రాగలను

మాత— కుమారా అమరాజ్ఞ నుల్లంఘింపఁదగదు నీతండ్రియగునా యింద్రుఁడవియన్నియు నొప్పింతుఁదీసికొని రమ్మనియెఁగాన శీఘ్రముంబుగా బయల్దేరుటయే సమంజసంబనితోఁచెడిఁతకు వాతనీచిత్తము.

అర్జు— (ఆలోచించి) సరేఁనమ్మను. (అనిరథమెక్కును)

మాత— (తామరథమెక్కిపైకిలేచుటసూచించి) అర్జునా చూడుమా పడమటిదెస నీరాకఁగోరిన నాకవాసుల మనంబులఁ బోలి రాగయుక్తంబై యెట్లు విరాజిల్లుచున్నదో! కుమారాభూమి వైపుకఁజూడుమా

సీ॥ తరణికిరణసక్త♦ తరుశాఖలెల్లెడ
స్వర్ణలేపనదీప్తి♦ సంగ్రహించె।
దముఁగొట్టవచ్చిన♦ శమమైరిగ్రుంకఁగ
దలెనంచునీడలు♦ తార్చుచువారె।
విష్కుహాంతరశీమ♦ నీడసింభకభక్ష్య
త్రోటులైనవిహంగ♦కోటిపాఱె।
నరవిందమకరంద♦ పరితృప్తమధుపముల్
పట్టువదుదునుంచుఁ♦బాఱిపోయె।

అరరే!యర్జునాకనుంగొనుమాయటు

గీ॥ స్వర్గమునసీకయిచెలంగు♦ సంబరములఁ।
గాంచవేడుకవేగమే♦ కంజమిత్రుఁ।
డదిగో! భూస్థలినివదలి♦ యమరలోక।
మొందఁబోయెనా వ్రాలెడి♦నందమునను॥ 33

(నిష్క్రమింతురు)

ఇదిద్వితీయాంకము

ఓమ్

శుభమస్తు.

# పాశుపతార్జునము.



## తృతీయాంకము.



### 1 వ రంగము.

ప్రదేశము—స్వర్గపురపుబయలు.

ప్రవేశము—రథముపై నర్జునమాతలులు.

మాతలి:—మధురగతి రగడ— కాంచినస్వర్గము ♦ కన్నులవిందగుఁ ।
గాంచనమయప్రా ♦ కారముబొందగు ॥

అర్జు— మాతలి! యివెకద ♦ మానగుబురుజులు ।
యే తెఱఁగుననివి ♦ యెక్కిరిదివిజులు? ॥

మాత— ఎత్తనినీవిపు ♦ డెంతయుఁబల్కెదు ।
నత్తినమెట్టుల ♦ నరయఁగఁగుల్కెదు ॥

అర్జు— అల్లదియేటిది? యాకసమందున ।
మెల్లగనాడెడి ♦ మించులచందున ॥

మాత— అయ్యదె కేతన ♦ మాడెడిఁగుల్కుచు ॥
జయ్యనఁదళ్కులఁ ♦ జాలఁగఁజిల్కుచు ॥

అర్జు— అద్దిర! చూఁడుమి ♦ యంబుధిఁబోలెను ।

పెద్దతరగములఁ ♦ బిట్టుగఁ గ్రాలెను ॥

మాత— కందకమదెసుమి ♦ కాంచుమియూరక ।

బొందుగ రాఁగఁగఁ ♦ బోలద దేరికి ॥

అర్జు— అబ్బురమయ్యెడి ♦ నరయుము మేడలు ।

గొబ్బున మణులను ♦ గూర్చిరి గోడల ॥

మాత— ద్వారము కనుమదె ♦ దారిపురము కయి ।

వారుగొనిల్చెను ♦ పర్వ్వలుమనకయి ॥

అర్జు— జాలముసేయకు ♦ సరగున నరిగెద ।

మాలలితామకు ♦ లడుగుల కెఱఁగెద ॥

మాత— ఆపైన నక్కడనేవారినిఁ గలసికొని పురప్రవేశము గావింతుము.

అర్జు— సరే రథముఁ బోనిమ్ము. (రథముతో నిష్క్రమింతురు)

2 తరంగము.

ప్రదేశము. ఊర్వశి మేడపై గది— ప్రవేశము ఊర్వశి సఖీసహితయై

చెలి— అమ్మా! యూర్వశీ! యీ వెలుగేమిటికి రక్తచంద్రికవలె నున్నది!

ఊర్వ— ఓసీ! వెఱ్ఱిదానా! యిదియే నీ యెఱ్ఱని మహాతాబు.

చెలి— ఆహాహా! చెలీ! చెలీ! చూడుచూడుము స్వర్గమంతయు వసంతమహిమమైపోయినది!

ఊర్వ— ఓసీ! వెనుకనల్ల యైరావతారూఢుఁడైన నరవసంతుని మహిమఁ దెలుపుటకుఁ గల్చినపచ్చమహాతాబు గానియీవసంతుని మహిమకాదే!

చెలి— (చూచి) ఔనే! చూడు! యీ వాహనములేమిటికిన్ని బయలుదేరినవి? ఎన్ని గుఱ్ఱము లెన్ని యేనుఁగులు!

ఊర్వ— ఈయుత్సవ మనుభవించుచుండిన నరుఁడెవఁడోకాని యిట్టి
వెన్నడు విననైనను విన లేదే?

చెలి— తొందరపడెదవేటికి కన్నియునుఁజూచెదము

ఊర్వ— (పరికించి) కానుకాను వారిరూపములించుక తెలియవచ్చు చున్నవి. అయ్యైరావతము మీఁదనిద్దరిలో నవతలివాఁడునా నాథుండింద్రుఁడే యివతలివాఁడెవ్వఁడో తెలియకున్నది.(తనలో) నామనసులో నాచిన్ననాఁటినుండియు నిల్చుఁగట్టుకొనియున్న యర్జునభూపాలచంద్రుఁడు కాఁడుగదా! యిదివఱకెన్నఁడునుఁ జూడలేదు కావునఁబోల్చ లేకున్నాను.

చెలి— చెలీ! ఏటికటుల నివ్వెఱపడుచుంటివి?

ఊర్వ— ఆదీప కాంతులు నాకన్నుల మిఱుమిట్లు గొల్పుచున్నవే?

చెలి— (నవ్వుచు)ఆసుందరాకార దీపకాంతులునిన్నుఁ గలిసెనేమో యనుకొంటిని అట్లు కాలేదుకదా?

ఊర్వ—(తనలో) ఔను నిజముటులే,(ప్రకాశముగా) పరిహాసము జేయుచుంటివాయేమి?

చెలి—చెలీ! చెలీ! (అనియేదియో యాలోచించుచున్న యూర్వశి నిగదిచి) చూడుచూడు మాతనిరూపరేఖా విలాసములు రాను రాను స్పష్టపడుచున్నవి.

ఊర్వశి—(అమితానందముతో) చెలీ! చెలీ!

మ॥ భళిరే! యీ మొగమందమున్ నిగనిగ్గై ◆ భాసించునా కాంతియున్।
బలమైనట్టియురంపుసొంపహహాసం ◆ భావ్యంబులౌ పల్కులున్।
వెలయన్ దీర్చిన కన్బొమల్ మిసిమియై ◆ వెల్గొందు మీసంబులున్।
జలజాతాస్యము గల్గునీతనిని వా ◆ సంబేది పేరెద్దియో ॥ 2

చెలి—ఆహా! యిప్పుడుకదా నా యనిమిషత్వము సార్థకమైనది.

ఊర్వ— (తనలో) ఏమియీసౌందర్యము.

ఉ॥ అబ్బ! యిదేటిరూపితఁడ ♦ నంగుఁడనంగనునం గరంగుఁజే
నిబ్బరపుంసుధాకరుఁడో ♦ నిండలచేత కళల్గొలంతగా
విబ్బలవంతుఁడెవ్వఁడో యిఁ ♦ కేభువికీబతియో? నిగారపుఁ
గుబ్బలఁ గ్రుచ్చి కౌఁగిటను ♦ గుల్కని కల్కికి జన్మమేటికీ ॥ 3

చెలి—ఏమేయూర్వశీ! అట్లేకూరుచుండి యొకేచూపుచూచుచుంటివి. నీవిలోకన చంచరీకములాతని వదనపద్మ మరందముఁ బీల్చుచున్నవా ?

ఊర్వ—(తనలో) అతనివదనపద్మమరందమే కాదు ! అధరసుధారసమే గ్రోలింప నిశ్చయించుకొన్నవి. ( ప్రకాశముగా ) చెలీ ! చూడు మేమిసౌందర్యమే ! !

సీ॥ పెనవేసికొనివాసిఁ ♦ గనిభాసితంబైన
భుజయుగంబున మెండు ♦ బొల్చువానిఁ ।
గమలంపుఁజెలువంబు ♦ నముదంబు ననయంబుఁ
గూర్చెడివదనంబు ♦ గుల్కువానిఁ।
గడునింపుఁగలిగింపు ♦ కాయంపుమురిపెంపుఁ
దళ్కుబంగరునెన్నఁ ♦ దనరువానిఁ।
జెలువారసరివార ♦ ములవారితముఁజేరఁ
గాలఁజమిరెడివి ♦ క్రమబలాఢ్యు।
మిసిమికెక్కిన నూనూఁగు ♦ మీసగాని।
సృష్టిఁజేయంగ నజుఁడెంత ♦ కష్టపడెనొ।
కమలనాభునిఁగూర్చిన ♦ గట్టితపను।
నిట్టివానిఁ జేయనెపోలు ♦ బిట్టు

చెలి— ఆహాహా! యూర్వశీ! నీవనినట్లు బ్రహ్మకెక్కడిదింత సామర్థ్యము! అబ్బ! యీధ్వని యేమిటి! చెవులుచిల్లులువ్రావుచున్నవి

ఊర్వ— (తనలో) ఆహా! యీతఁడునిక్కముగ నర్జునుఁడే కాకున్న నీరూపు పరునకేనికున్నది!

సీ॥ ఈమానవుజగాన • నేమానవతిగానఁ
దానవైఁబడఁగదు • దమకపడదు!।
యీభూమిపతిఁజూడ • నేభామకడుప్రేమ
మనసులోఁదలఁచుచు • మఱుఁగఁబోదు!।
యీసౌరుమరఁగేర • హీంత మారసేనారి
బలువుకోఁగలిఁగోరి • యలసిపోదు!।
యీప్రౌఢమతిఁజూడ • నేప్రోఢతనుఁగూడ
వేఁడగామనసును • వెంటనిడదు!।
యితనిఁగాంచియునేసతి • యిందుపైని
గందుగనదు? యీసుకుమారుఁ • గాంచియేసు
దతియు నీసు మధుపములపైఁ • దాల్చఁబోద?
కాననేనింక ధృఢమనం • బూనగలనె!॥ 5

చెలి—(తనలో) ఈమె యీదినమునఁ గ్రొత్తగాఁ గనంబడుచున్నది. కులము జెఱచెడి బుద్ధులిట్టియవి నీతులకుఁగాక యొండొకరికిఁ బుట్టునా? (ప్రకాశముగా) చెలీ! యీపులకాంకురము లేటికే యీనిట్టూర్పు లేమిటే? ఋషియున్నియు నీనాథునిఁ జూచియేనా? (కదిపి) కదలకుంటివేమే? యోసినీవిక్కడుంటివా లేవా?

ఊర్వ— (కోపముతో) నీవుంటివాయని యడుగుచుంటివి నీకన్నుల గపడుచున్నవా? పిచ్చిదానా! పిచ్చియూహలఁ దెచ్చికొనకుము.

చెలి— కాదే ! నీహృదయము పరువెత్తుచున్నదని చెప్పితిని. పోనిమ్ము
పిచ్చివారలకు మంచివారు పిచ్చివారేలే ! అని సంతఁగోపము
నాకురాదు.

ఊర్వ— అబ్బ! యెందులకే యీగొడవ ! చూడుమాసుందరాకారుని.
యింద్రునిఁగిందునిరూపముచేత సేయెట్లుసిగ్గుపఱచుచున్నాఁడో!
(తనలో) ఆహా ! యెట్లోకదా !

మ॥ తళుకుల్జిల్కెడు వీనికౌఁగిటనునం ♦ దంబొప్పఁగాఁ దేనెసో !
నలనూరించెడి మోవినాదుమొనవం ♦ టన్ నొక్కుచుం గబ్బిగు !
బ్బలురమ్మొత్తఁగ హాత్తిమత్తిలినయా ♦ పంచాస్త్రుపేరన్ లలా !
మలఁజిత్రంబులనేఁచునీతనిపనిం ♦ బట్టంగ నేనోదునే॥

ఈతఁడర్జునుఁడే కానియెడల నన్నేల మరులఁగొల్పును ? నిక్క-
ముగ నీతఁడా ధనంజయ భూపాలవతంసుఁడే !

చెలి— సఖీ ! యూర్వసీ! మానవప్రీతము బూనితివేమే ? ఎవనికొఱకీత
పము, నీవుచెప్పకున్ననేఁ గనుఁగొనలేనను కొంటివా ? చూచి
నవారి నందఱి మోహించుట మనలో నెన్నఁడు లేదుసుమా !

ఊర్వ— (ఉస్సురని) చెలి ! యేటికే యిట్టిమాటలు నేనుగాని చూచిన
వారినందఱి మోహింతుననుకొంటివా ? నానాథునే చూచు
కొనుచుంటిని.

చెలి— (నవ్వుచు) నాథునికొఱకేయని నేనునెఱుఁగుదు నాతఁడెవ్వఁ
డోయనికాని.

ఊర్వ— చాలుఁజాలు నూరుకొనుమిఁకఁ (వీధిపై పరకుఁజూచి) చూడు
చూడు మావందిమాగధులేలాగునఁ బోవుచున్నారో ?

చెలి— ఉండుముండుము ! అతనినే పొగడుచున్నట్లున్నది

ఊర్వ—(తనలో) అర్జునుఁడనియే వీరలందురా ?

(నేపథ్యమున)

గీ॥ అచ్చరనై నవలపించు ♦ నందకాఁడు ।
పశుపతినిఁగొల్చివరమొందు ♦ బలయుతుండు ।
లలితఖాండవదహనంబు ♦ సలిపినాఁడు ।
అసురనాయకు పుత్రుఁడీ ♦ యర్జునుండు ॥ 7

ఊర్వ—(అమితానందపరవశయై) ఆఁ ! ఆఁ ! నాయర్జునుఁడే ! నాప్రేమానిధియే ! నామనోహరుఁడే (అనిమూర్ఛిల్లును)

చెలి—(అబ్బురముతో) అయ్యో ! యిదియేమిటిది యేమిటి ? చెలి ! చెలి ! అయ్యయ్యో ! చేలా ; పేరువిని మూర్ఛిల్లువారలుందురా ?

(అనికొంగున విసరును)

ఊర్వశి—(ససంభ్రమముగా లేచును) ఆహా ! చెలీ ! నేనేమైతిని.

చెలి—చెలీ ! యూర్వశీ !

గీ॥ ప్రాణసఖినైన నాకుఁజె ♦ ప్పక యెపోయి ।
యెన్నినాళ్ళనుండియొనీవు ♦ నీతనికయి ।
మగుని చుఱుకైనముల్కుల ♦ మఱఁగితమ్మ ।
పణ్యవనితలకిది యేటి ♦ పాటియమ్మ ? ॥ 8

గీ॥ వలపులుండినఁగాంతలు ♦ వారినివల ।
పించితుట్టతుదకువిల ♦ పింపఁజేసి ।
మనసులోఁతునుగనిపెట్టి ♦ మఱికవయుదు ।
రంతెకాని మొదటనేయి ♦ టగుటకలదె ? ॥ 9

గీ॥ అన్నికులములకంటెను ♦ నధికమైన ।
గుట్టుగల్గినవేశ్యల ♦ కులమునందు ।

జననమొందితివి; మఱెని ♦ ర్జరలతాంగి ।
వైతివట్టినీకఁ బెఱుట్టి ♦ యాతిఁ జెప్పుము ॥ 10

ఊర్వ—(నిట్టూర్పువిడిచి) అబ్బ ! నీమాట లిప్పుడు నాకు వినంబడుట లేదు. నాకేమియో జ్వరము వచ్చునట్లున్నది అక్కటా ! యీ బ్రతుకు నాకింక (అని చెప్ప లేక కన్నీరు నించును)

చెలి—(కన్నులనీరుఁదుడిచి) చెలీ ! యున్నది యున్నటుల చెప్పక నన్ను వేధింపనగునా ? నీ చెలినగు నాకే చెప్పకున్న నెట్లింక . నీ హృదయ చోరుఁడితఁడేయని స్పష్టపఱచినయెడల నిప్పుడేయా తని నీవ్వుకొని రాలేనా ?

ఊర్వ—అమ్మా! నీవే నా ప్రాణమవు యీ ద్వైరావతారూఢుఁడైన యిం దర్ద్వితీయుఁడే యాయర్జునుఁడే (వీథివైపునకుఁ జూచి) అయ్యో! అప్పుడే యీయుత్సవముదృశ్యమైనది. అయ్యో! యింకొక సారియైనఁ జూచుకొనుటకు నోఁచనైతినే ? యేమిసేయుదు.

గీ॥ ఆసొగసుగాని నొకసారి ♦ యైనఁగనుఁ ।
గలవుఁదీరఁగాఁగాంచుభా ♦ గ్యంబునాకుఁ ।
గలుగదయ్యె! నక్కటకటా ! ♦ కులుకులానిఁ ।
గాంచకుండిన నే బ్రతుకు ♦ కంగలానె? ॥ 11

చెలి—అమ్మ ! యూర్వశీ !

గీ॥ బాల! యేలయీలీలలఁ ♦ జాలగవిల ।
పించ నీనిలింపతతినె ♦ యింపుమీఱఁ ।
ద్రిప్పినయటు లిరుగఁ జేయు ♦ దిట్టనీవు ।
చేయివిచి మునులఁ బెచ్చు ♦ చెలిని నేను ॥ 12

గీ॥ కానినీవలవంతఁబో ♦ క్కంగనేల ? ।
చెప్పులఁబట్టి యీడ్చుక వత్తుఁ ♦ జెలువునిపుడు ।

తాల్మిఁ బూనఁగనగుఁగాని ♦ ధవునిఁదలఁచి ।
యట్టిమూర్ఖులుదగునె వే ♦ శ్యలముగామె? ॥ 13

గీ॥ అదియుఁగాక మున్ నీవల ♦ లందుఁదగిలి ।
గిజగిజైన మునులకన్న ♦ విజయుఁడధికుఁ ।
డఁటనె? రూపునమాత్రమే ♦ మంతయుట్టి ।
పడెనె? నల్లబొగ్గునుఁబోలుఁ ♦ వాఁడుపడఁతి! 14

ఊర్వ— చాలుఁ జాలుబాగు గావాఁగితివి !!

ఉ॥ అమ్మకచెల్లవానినయ ♦ నాంబుజములు భుజముల్వికాసమా ।
నమ్మగునె మొగంబునల ♦ నాఁచునుబోలు గురుల్కనుంగొనన్ ।
బమ్మరవ్రాక నిల్చుదురె? ♦ పాదములన్ బడివేఁడరే? కడున్ ।
గమ్మని మోవినిచ్చితముఁ ♦ గావుమటంచును నెట్టిప్రోడలున్ ॥ 15

గీ॥ అట్టికులుకుసోయగమెందు ♦ నరయఁగలమొ ?
వానివర్ణింపనాశేష ♦ వరునికగునె? ।
పుట్టినందులకాతనిఁ ♦ బొందవలదె ? ।
అతనివిడనాఁడి నేనింక ♦ బ్రతుకుటెట్లు? ॥ 16

చెలి— ఆహా ! యీ వెవలపు తలకెక్కినది దింపుటసాధ్యముగాదు ! ఇంకనుపేక్ష జేయరాదు (ప్రకాశముగా) సకియా ! యేటికీ మాట. నీనెచ్చెలినైయుండియు నేనూరకుందునా ? వానిలోఁ బరచుటెంత వంతదక్కి కర్తవ్యాంశ మాలోచించుట్టొప్పు గాని వాపోవనగునా ?

(అని చేరఁదీసి కన్నీరుఁ దుడుచును)

ఊర్వ— అమ్మా ! నేనింక బ్రతుకఁగలనా ? అతఁడా కనుమొఱఁగి పాఱిపోయె. నీవలఁజందురుండే కాఁబోలు.

గీ॥ శాతశరములఁబోలిన ♦ చంద్రికాకి ।
రణము లేపుమైనామీఁదఁ ♦ గనలి యేయఁ ।
గాఁడోడంగెఁ బయోముఖ ♦ గరళకలశఁ ।
బోలి; యేమి సేయుదుఁ బువ్వుఁ ♦ బోఁడి యింక ॥ 17

సఖి ! చూడుమెట్లున్నాఁడో వానిరూపుమాయ !

గీ॥ విరహిణీకాంతపాలిటి ♦ విషమనంగ ।
సూనశరుబాణములనూఱు ♦ సానయనఁగ ।
దోషమను కాంత దాల్చెడి ♦ తోయజమనఁ ।
మింటవెలుఁగొందుజాబిల్లిఁ ♦ గంటెఁ ? సకియ !॥

చెలి—(తనలో) పచ్చకామెర్లుండుదానికి జగమెల్లఁ బెండ్లికొడుకులాటు యబ్బురమా ?

ఊర్వ—(కోపముతో) ఓరీ ! దోషాకరుఁడా నీకుసిగ్గులేదుకదరా !

ఆ॥ వె॥ విరహిజనులనీవు ♦ వేధింపకుండఁగఁ ।
గాలకంఠుఁడపుడు ♦ కాలఁజమిరె ।
నెలకునొక్కసారి ♦ విలయించునీవిప్డు ।
సంబ్రపడెదవేర ? ♦ చంద్రహతక ! ॥ 18

అయ్యో ! వీఁడెన్ని చెప్పినను వినఁడు నాబ్రతుకింతే ! (కొంతసేపూరకొని) అమ్మయ్యో ! యిదియేమే యగ్నినుండి వీచెడుగాలియిట్లు నన్నుఁ జుట్టుకొనుచున్నది ?

చెలి—(తనలో) ఇవియన్నియు విరహపిశాచలక్షణములు (ప్రకాశముగా) చెలి ! యిది యగ్నివలెఁ గ్రాఁగుచున్న నీదేహముపైఁ బడుటచే నంత వేఁడిగా నున్నదికాని యదిమలయమారుతము.

ఊర్వ—ఓరీ ! మలయమారుత చండాలా !

క॥ ఏమిర ! కన్నులఁగానక
భామలనొంటిగనుజూచి ♦ బాధించెదవే ।
పాములకెఱచినజావవ ।
హా! మారుత మాదుపాప ♦ మో యిటులయ్యెన్ ॥ 20

(ఉస్సురని) అయ్యో! వీరందఱింతే ! వీనికిఁ దోడుమదనుఁడును నామెద గదలఁబడునగు పుష్పశరముల వదల మొదలుపెట్టె. ఇఁక నేమి సేయుదు.

క॥ అదిరా ! మదనా ! యిదియే
యదనా? యెదనాటనేయ ♦ నాశుగశతముల్ ।
మొదలే శివుచేనొడలున్
వదలెన్ గదరా ? మఱేల ♦ బ్రతికితిమూర్ఖా ॥ 21

అయ్యయ్యో ! చెలి ! యిఁక నేఁ బ్రతుకఁజాల సమయుదమన్నఁ బ్రాణములు పోకుండ నమరనై పుట్టితినిఁక నెట్లు? చెలికైనఁ గరుణవొడమదు. అతఁడా నన్నెఱుఁగఁడు కాలమా విపరీతమయ్యె నేమిసేయుదు. నెవరి శరణుఁ జొచ్చెదను? ఏదిదిక్కు ?

గీ॥ కటకటా ! చెలి ! నేబ్రతు ♦ కంగఁగలనె ? ।
తీవ్రవిరహంబుపాలయి ♦ తెరువుఁగాన ।
కార్తనై విలపించుని ♦ యతివఁజూచి ।
నలినలోచన ! కాచిపు ♦ ణ్యంబుఁగనుమి ॥ 22

(అనిపాదములపైఁబడియేడ్చును)

చెలి — సఖి ! యూర్వశీ ! యిదియేటిమాట ! లేలెమ్ము ! నాకుఁబుణ్యంబు వచ్చును గనుక నా నిన్నుఁ బ్రోవవలెను ? యింతవల వంతఁ బొందఁదగదుసుమా! అతఁడు కాని మునీశ్వరుఁడనుకొంటి

వా? వాఁడునొక నరుఁడే యతనివంచించు టెంత ?

ఊర్వ—అమ్మా! యాతఁడునన్నుఁ జేపట్టునా ?

చెలి—చేపట్టక మానునా ? మనసంగతి నెఱుఁగఁడా ?

ఊర్వ—ఏమి సేయుదువ్వో నీదియే భారము.

చెలి—రమ్ము పోయి కర్తవ్యమాలోచించుకొందుముఁ

(నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.





ఓమ్

శుభమస్తు.

# పాశుపతార్జునము.

## చతుర్థాంకము.

### 1 వ రంగము.

ప్రదేశము–ఇంద్రసభాద్వారము. (ప్రవేశము–ద్వారపాలకుఁడు కత్తితో

ద్వారపాలకుఁడు—(మాటిమాటికిఁ గునికిపాట్లుపడుచు) ఆహా! స్వర్గమునకు వచ్చినను సవతిపోరు దప్పినది కాదనునట్లున్నది (యించుక నిద్రచేఁదూఁగి) నల్లమందు పట్టుచేసినది కాదు. కనుక నే తెల్లనిగుఱ్ఱము నెక్కినట్లు తూలుచున్నాను. (మఱలక్రిందఁబడఁబోయి) చాలు నీనాట్యము సావకాశముగాఁ గూరుచుండి యే డ్చినమంచిది (ఆలోచించి) యెవరైన వచ్చెదరేమో! ఆ! యెవరును రారు (అనిభయముతోఁ గత్తినొఱలో నిమిడ్చికూరుచుండును) హర! హర! హర! గోవింద! గోవింద! శ్రీరామచంద్ర! (అని పెద్దపెట్టున నావులించి) (చిటికివేయుచు) నారాయణ! నారాయణ! నిద్రకాఁబోలు వచ్చుచున్నది! నిన్నటి యుత్సవమింతవఱకుఁ దెచ్చినది! నిద్రపోని బ్రదుకెందులకు? (అనియొక తుమ్ముతుమ్మి) చిరంజీవ! ఆఁ నేనేనా తమ్ముట

మఱచిపోయి యెవరో తుమ్మిరనుకొని చిరంజీవయని కూడ ననుకొంటిని. అయినను నిద్రచే నింతచేటు వాటిల్లినది. నన్ను దినమున కరువదిగడియలును నిద్రపొమ్మన్న నితరుల నిద్రపోనియ్యనంత పెద్దగుఱ్ఱుతో హాయిగా నిద్రపోదును. ఆ పాటిదాత యేఁడి? ఆవెఱ్ఱిబ్రహ్మ కుంభకర్ణునకుఁ దనకేదోయాత డునెత్తిమీఁద దేవతయని కాఁబోలును నారునెలల నిద్రసులువుగా నిచ్చివేసినాఁడు నేనున్నానని యెఱుఁగడు గాఁబోలు. (అనికునికిపడి) యీతరకలనవాజు నాకబ్బినదేమి చెప్పుమా (ఆవులించి) ఏదియైనను నిద్రతో సమానముగాదు.

నిద్రయెప్రాణాధారము । (అనియొకసారికునికి)
నిద్రయెలేకున్నజనుఁడు ♦ నీల్గుటనిజమే! । (పెద్దపెట్టుననావులించి)
నిద్రకొఱకె కాదకెసం ।
ప్రదమణుండెపుడువేశ్య ♦ భావలఁజేరున్ ॥

(అనికునికిపడి యట్లనేనిద్రపోవును)

ంత ద్వారపాలకుఁడు ప్రవేశించి) అరే! యేమిమర్యాదరా । యెంతరాజయోగమురా ! తలక్రిందుగాఁ బదునాలుగువేల వత్సరములు తపమాచరించినను లభించని సింహాసన మట్టేదొరికినదిరా! ఇంతకు నతఁడెంతయో గొప్పవాఁడై యుండును లేకున్న రంభయంత సంతసముతోఁ జూచునా ? (ఆలోచించి) కాదు కాని మనయూర్వశి వరుసఁజూడ వీనినొక యాటయాడించునట్లెదోఁచుచున్నది, పోనిమ్ము మనకెందులకు ? యెవ తెట్లు పోయినను మనకేమియు లాభములేదుకదా!(పరికించి)ఓహో! ఇదిగో ! యీనిర్భాగ్యుఁడు ! కునుకుచున్నాఁడు ? కానిమ్ము

నా సేవనాకాలమైనదికదా ! వీనిఁగొంచెమాడించియే పోదును గాక. (మఱియొకగొంతుతో) అరే! నందా! ఏమిదిదున్నపోతా!

నందు—(దద్దిరిల్లలేచి క్షత్రియునికొని యొఱచేతఁబట్టుకొని) హా! మహా ప్రభూ! క్షమించవలె ముసలివాఁడను! (అనివడఁకఁదొడంగును)

2 వద్వార—(నవ్వి) తాతా ! నిద్రా ! నేను.

నందు—(పరికించి) ఆరి ! దొంగముండకొడుకా ! నీవఁటరా! గోపా ! యెవరో యనుకున్నాను ! నీవెప్పుడింతేకదా ! నిద్ర బోవువారి లేపకూడదని యెఱుఁగవూ ?

గోప—తాతా! క్షమింపుము ! రాజువచ్చునేమో యని లేపితిని ! కాని తాతా రాత్రినేమైన మహాతాబులఁ గాల్చితివా యేమి! అదియే మిగండు పిల్లిలాగున్నావు ?

నందు—మఱల మొదలిడితివా యెకసక్కెములకు? యెవరినేనాయడిగినంతమాత్రమున నే మహాతాబులఁగాల్చుటా ?

గోపు—ఎవరినడిగితివి రా !

నందు—చెప్పను రాబాబు ! నీవందరితోఁజెప్పుదువు

గోపు—చెప్పనురా ! ఎవరిని ! ఆఁడుదానినేనా !

నందు—ఆఁడుదానిఁగాక మగవారి నడుగుదురా ! అందుకొఱకే నీతో జెప్పనంటిని.

గోపు—అదికాదురా ! నాట్యము జేయుదానిని యడిగితివా !

నందు—ఆఁ ! యెఱుఁగవఁటరా మనమేన—

గోపు—మేనత్తనే కోరితివిరా ?

నందు—మేనత్తను గోరుటకు వెర్రిగొల్లఁడను కొంటివి రానన్ను ?

గోపు—కాదురా ! నీవుమావవైన మేననాకత్తకాదా !

నందు—కాదా మఱి ? అదియా నీయర్థము ? అవునురా యల్లుఁడా

గోపు—అయిన నేమన్నది ?

నందు—ఏమనును ఎప్పటియట్ల సెలవిచ్చినది !

గోపు—అనఁగాఁ జావఁగొట్టినదా యేమిటి?

నందు—కొట్టునా ? నేనునందుఁడనని యెఱుఁగదూ ?

గోపు—మఱియేమి చేసినది ?

నందు—మొదలాముండ యింకొకరి కొఱకేడ్చుచున్నది. యీవాఁడు కూడదనినది.

గోపు—సరిసరి. అందఱాలాగేడ్చుచున్నారా ! బాగున్నది !

నందు—ఇఁకనెవరురా !

గోపు—ఇఁక నెవరు ! మనయూర్వశి మ్మగోరే !

నందు—అయ్యో అయ్యో ! మనయింద్రుని నోటిలో మన్నుఁగొట్టెనా ? యేమున్నది పాడుకాలమువచ్చినది: ఇందుచేతనే వెలయాండ్ర నమ్మఁగూడ దన్నాఁడు. కాని గోప ! యెవరికొఱకాయేడ్పు ?

గోపు—మనయూరునకుఁ గ్రొత్తవాఁడగు నాయర్జునునికొఱకే !

నందు—ఆఁ ! ఆ ! ఆహాఆహా ! ఏమిరా వానిభాగ్యము ! ఏమిరా వానిపని! టపాకాయలాగున పెళ్లేల్మని పేలుచున్నది! ఆయుత్సవము జూచినప్పుడే యనుకొంటిని యేదో ముప్పువచ్చునని అబ్బా ! యీదేవతలందరు నేమిమర్యాద జేసిరిరా ! ఇఁకనెందులకుఁగాళ్లమీఁదఁ బడినారనినమ్మము.

గోపు—ఇదివేఁనా నీవుచూచినది. లోపలవానికర్ధసింహాసనమిచ్చి యెవడో పెద్దవేల్పువలెఁ బూజించిరి. యీనాట్యంపు ముగువలందఱు సాగిలి మ్రొక్కినారని నమ్మము. మనగురువుగారేమి పొగ

డినాఁడురా ! అబ్బ ! తటపటలాఁడిపోయినవి శ్లోకములు ఉక్కుముక్కలు ! ఇంకొకరహస్యము వినుము. అతఁడేమో యతనితల్లికి మసయిందుృఁడుగారి ప్రసాదమువలననే పుట్టెనాఁడఁట కనుకఁ గొడుకఁట.

నందు—సరి ! సరి ! అంతరబొంతర కొడుకులు చాలమంది రాజ్యము నకై వచ్చెదరు కాఁబోలు ! దానికేమి మనవాఁడుగూడ నేమే నియిచ్చఁ జూపించుచున్నాఁడా లేకనపుంసకునివలె నున్నాఁడా?

గోపు—యేమో అదినాకుఁదెలియదు కాని మొన్నొకమాటవింటిని

నందు—ఎవరివిషయమై

గోపు—యీవిషయమై నీవిషయమైకూడను.

నందు—నావిషయమై యేమిటిది ?

గోపు—ఇంకనువిప్పి చెప్పవలెనా ? నీకొఅకొకతె

నందు—నాకొఅకే ! నాకొఅకే ! యెవతె ! చెప్పవు ? చెప్పవు ?

గోపు—చెప్పిన నాకేమిచ్చెదవు ?

నందు—ఏమైననుసరే నేనేనీవెనుకఁ గుక్కవలె దిరుగుచున్నను దిరుగుదు. వేయునేలనేఁజచ్చి నీకడుపునఁ బుట్టుదును సరియా ? యింకఁజెప్పుము.

గోపు—దానిపేరు మఱచిపోతినిరా ! ఆఁ ఉండుముండుము మృ. మృ జ్ఞాపకము వచ్చినదికాదురా !

నందు—అయ్యో ! యేలాగుమఱి ! పోనినీవువర్ణించినచో నాకుశాగ్రబుద్ధితో గ్రహించెదను.

గోపు—వర్ణింపకేమి ? వినుము ఆమె మొగము నిక్కముగానమవసి చంద్రుఁడే !

నందు—అంత తెల్లగా నుండునురా ?

గోపు—దానికనులు నిక్కముగాఁ జేపకున్నలే !!

నందు—బాబో ! యెంత పెద్దవి !

గోపు—ఆవనితకాళ్లు బూడిదయనఁటి బొందలవలెఁ జెప్పనలవిగానంతం తయుండును.

నందు—అయిన మిగుల సౌందర్యవతి యనుమాట !!

గోపు—వినుము. ఆపెనడుముచుట్టుగుడిశెవలె నీయుండి నడచునప్పుడు చూడఁగన్నులుండవు.

నందు—ఇఁకఁ జెప్పనక్కఱయే లేదు. కానిమాటల విషయమై చెప్ప లేవి కావు.

గోపు—ఔనౌను. మఱచిపోతిని క్షమించుము. ఆకలకంఠి స్వరముఓటికుండవలెఁ గడు శ్రావ్యముగాఁ బిల్లికూఁతకు మేనమామపోలికగానుండును.

నందు—అబ్బ ! నాకంఠస్వరముతోఁ గలియునన్నమాటయే !

గోపు—ఆమెనీకై చాల నేడ్చుచున్నదిరా ! నీవమరుఁడవైతివని గింజుకొనుచున్నది.

నందు—సరి ! సరి ! అయినఁ దప్పేమి ? దీనజనులభుఁడను నాకై యింతవంతఁ జెందఁదగు నా యామెపాపమొవతెయో చెప్పుము జ్ఞాపకము వచ్చినదా ?

గోపు—ఆఁ ! వచ్చినదిరా !

నందు—ఆఁ జ్ఞాపకము వచ్చినదా బ్రతికించినది ! మొదలకడనే పొడగట్టినది. నాయనా చెప్పు. నాతండ్రి చెప్పుము.

గోపు—ఆఁ ! అంతతొందరయే ముందుము చెప్పెదను.

నన్ను—అబ్బ ! చెప్పవురా ? బాబు నీకొకనమస్కారము చేప్పవు ? చెప్పవు ? (అనికాళ్లమీఁదఁబడును.)

గోపు— (లేవదీసి) ఓహో ! విన్నంత నేతొందరా !

నందు— చెప్పరా ! పేరు చెప్పరా ! పోనిమ్మింత యేడ్పించుట నీను దగదు పోనిమ్మొకచూపుఁ జూచెదము కదాయని యడుగు చుంటిని

గోపు— ఉండుమటి. (దూరముగా జరుగును)

నందు— ఆహా ! ఆలాగునఁ జెప్పవలె లేకపోయిన నీబాధ పడలేను రా బాబూ !

గోపు— అప్పుడే బాధ మొదలు పెట్టినదిరా !

నందు— నాతండ్రివి కావు !

గోపు— ఇదిగో (అనిపాఱిపోవుటకు వీలుజూచుకొని) వినుము

నందు— వినుచున్నాను

గోపు— మృత్యుదేవతరా (అని పాఱిపోవును)

నందు— ఆరిముండకొడుకా! చూడుని న్నేమిచేయుదునో

(అని వెనుక నేపరుగెత్తును)

యవనికజారును !

2 వరంగము.

---

ప్రదేశము అర్జునాంతఃపురము

(ప్రవేశము అర్జునుఁడు హంసతూలికోపవిష్టుండై

అర్జు— (ప్రక్కనున్న యుద్యానవనము వైపు జూడ్కి నిగిడించి)

ఉయ్యగాథ—

ఇమ్మృగవనంబునను ♦ దుమ్మెదలు రేఁగికడు ♦ జుమ్మనుచు

సూన ములు ♦ దొమ్మిగను దూఱెన్ !

సమ్మ్రదముగొల్పఁగుసు ♦ మసుమ్మ్రలుజెలంగిఛద ♦ సమ్ములను
గ్రమ్మ్రించిరు ♦ కొమ్మ్రలవెలుంగన్ ।
గొమ్మ్రలనుప్రాలించిగు ♦ రమ్మ్రదొరశంఖసుర ♦ వమ్మ్రసఁగఁ
గోకిలర ♦ వమ్మ్రలటఁజేయున్ ।
గమ్మ్రవిఃబుతున్ గొలుచు ♦ నమ్మ్రదగుబంటుగువ ♦ సమ్ముదొర
పాంథవిర ♦ హామ్మ్రెసఁగవచ్చెన్ ॥ 2

ఆహా! వలరాజునకు ఋతురాజు బంటని చెప్పుటలో నాశంత యు సందియము లేదు ఏలయనిన

గీ॥ పుష్పవతులై భూజములు ♦ పుష్పవతులఁ
బొందనాసలనీరిక ♦ లొందఁజేయుఁ
గాంచనసుమంబుఁగాంచద్రు ♦ క్ప్రంచరీక
ములను జెఱకొమ్మకై వ్రాలఁ ♦ గొలుపుటరుదె? ॥ 3

అయినను విశ్చలచిత్తుల నిట్టివేమియుఁ జేయనేరవు. పుష్పసామీప్యంబుఁబోలెఁ బురుషసాన్నిధ్యంబు చంచలాలకలఁ గలంచకమానదు. మఱియును:—

గీ॥ అబలలనుమాటయేకాని ♦ యతివలెప్పు
డధికసాహసోపేతలై ♦ యలరుచుంద్రు
కాంతలకుఁబెరవానిపైఁ ♦ గాంక్షకలుగ
నేకలుగదుకలిగినచో ♦ నెరపితీరు ॥ 4

కనుకనే మనపెద్దలు వనితలనట్టిగట్టి కట్టుబాటులలోఁ గట్టిపెట్టిరి (పరికించి) ఆహా! తూరుపుదెసఁదన చంద్రికాకరములు దారిఁజూఁపసరోవరంబులు కుముదంబులనుపేర హాగతులెత్త రాజురాగయుక్తుండై బయలువెడలె ? అయ్యో! యీపద్మములు చంద్రుఁజూచిముఖము ముడిచినవేమి చెప్పుమా! ఔనౌను దోషాకరులఁ

జూడ నేరికసహ్యతఁ గలుగదు అదియుఁగాక తల్లింబట్టిననీతనికింత కన్న నెక్కుడు మర్యాద జరుగునా? అల్లదిగో చంద్రబింబము,

(అంత నూర్వశి సర్వాలంకృతయై ప్రవేశించును.)

ఊర్వశి—(దూరముగాఁ బ్రవేశించి)

వనమయూరము—శీతకర ! యేటికిటు ◆ చిత్తముగలంపన్।
నాతగులమొందఁగధ ◆ నంజయునిమీఁదన్ ।
శాతశరముల్ బలెన ◆ సహ్యకిరణాళుల్ ।
భీతిఁగొలుపంగఁబర ◆ పింపఁగదవేగన్ ॥ 5

ఆహా ! చంద్రా ! నీకుదయ లేదుకదా. జాతినిఁ గరగించు నీశక్తినాభూపాల చంద్రునిపై నించుక చూపి యాతని మనసు ననుఁ బొందునటులఁ గరంచలేవుకదా ? ఛీ ! ఛీ ! విషమునకుఁ దోబుట్టువైన నీకేటిదయ? ఆమన్మథహంతకుఁడు నీమేనల్లుఁడగుటచే నీగానములన్నియుఁ బుణికి పుచ్చుకొనెను. మీఁకుఁ దోడు నీవసంతుఁడును బంటయిమెలంగుటకుఁ జేరె విరహిణుల బ్రతుకబద్ధమే! (పరికించి) నాకూరిమిసంగడీఁడడుగో! ఆహా వానిరూపరేఖావిలాసంబులెంతచూచినను దనవిదీరదు. ఇఁక నేఁదడయఁజాల,

సీ॥ పల్కుబల్కున సుధ ◆ లొల్కునీకుల్కులా
నినిబల్కరించక ◆ నిలువఁగలనె? ।
నిద్దంపుటద్దాల ◆ కుద్దియౌ చెక్కుల
ముద్దిడకేనువా ◆ పోవఁగలనె ? ।
రంగారుతళుకేరు ◆ రంగారుసుకుమారు
మేనిపై వ్రాలక ◆ మిడుకఁగలనె ? ।
మరుపీఠికినిసాటి ◆ యురముగ్లాసిమేటి
గుబ్బలఁగ్రుచ్చక ◆ కుందఁగలనె ? ।

గీ॥ యలవసంతునకును లేని • కులుకుసోయ।
గంబుగలుగుసీతనితోడ • డంబుమీఱి।
యంగజక్రీడఁ దేలక • నిఁగిఁగనుచు।
వెంగలినయి నేభంగప • డంగలానె?॥ 6

అర్జు—(ఊర్వశిఁజూచి) ఓహో! నాతండ్రి యింద్రుని యింతియగునూ ర్వశి యిటువచ్చుచున్నది. ఈమెనాకుఁదల్లికదా!

ఊర్వ—(జేరంజని) రాకుమారా! క్షేమమా,

అర్జు—(లేచి) అమ్మా యీయున్న తాసనమధిష్టింతువుఁగాత! (తానున్న పాన్పువదలి ప్రక్కనున్న మఱొకదానిపైఁ గూరుచుండును)

ఊర్వ—రాజా! రాకుమారునియొద్ద మాకేటికి నీవునిందె వసింపుము.

(అని చిఱునవ్వునవ్వును)

అర్జు—(తలవంచికొని) తల్లియాజ్ఞ (పాన్పుచిట్టచివఱఁగూర్చుండును)

ఊర్వ—(తనలో) ఆహా! యిప్పుడుకదా నాకోరిక కొంతగొంతఁ దీర నారంభించినది (కొంచెము దగ్గరకుజరిగి) (ప్రకాశముగా) భూ పాలచంద్రా! నీవెప్పుడైన నన్నుఁ జూచితివా?

అర్జు—అమ్మా! చూడకేమి నిన్ను మాయమ్మయనికూడ నెఱుఁ గుదును.

ఊర్వ—(తనలో) ఓహో! యీతని వారివేఱుగానున్నదే (ప్రకాశ ముగా) సరే మాకులము?

అర్జు—కులము గంధర్వులనియు నెఱుఁగుదు.

ఊర్వ—సరి! సరి! నీవెఱుంగనిది యుండునా? మావారందఱింద్ర సభలో నాట్యమొనరించుట నీవు చూచితివికదా?

అర్జు—చూడకేమి వారందఱమరులుకదా ప్రతిదినముఁ జూచుచుంటిని.

ఊర్వ—(తనలో) అయ్యో! నాప్రయత్నము నిష్ఫలమగునా? కాదు

కాదు ! అన్నిటికి నామాటకుడేయున్నాఁడు. ( ప్ర  శము )నవ మోహనాకార ! మీసభలలోనిట్టి నాట్యకాంతలుందురుకదా?

అర్జు—ఉండకేమియున్నారు.

ఊర్వ—(దగ్గఱకుజరిగి) సుందరాకార ! ఆసుందరులు బాగుందురా ! మేమే బాగుందుమా ? (గడ్డముబట్టుకొని) ఇంతసిగ్గేమిటి మా బోట్లయొద్దనా నీచమత్కారములు ?

అర్జు—(తనలో) ఈపెబుద్ధి వెడదారిఁ బట్టినట్లున్నది. ఏమిసేయుదునైన ధైర్యము వీడరాదు (ప్రకాశముగా) అమ్మా ! ఎవరియందము వారిది.

ఊర్వశి—సెబాష్! రాకుమారా (అని చెక్కుముద్దిడి) (తనలో) ఆహా! యీముద్దాయధరంబైననొడల నాయొడలుకడుధన్యంబౌఁగదా?

అర్జు—(తనలో) యీ ప్రేమయంతయు నన్నునరకమునకుఁ ద్రోయును ద్యుమమేమోయని దలఁకుచున్నాను. ఇది పుత్రవాత్సల్యమైన యొడల బ్రతుకుదును. (అని ముఖముముడిచి దూరముగ దొలఁగును)

ఊర్వ—(ఇంచుకసమీపించి) రాకుమారా ! నీ చెక్కుముద్దిడినంత నేయొట్లుకందినదో ! (అని చెక్కుపైఁ జేయిపై చి తనలో) యిప్పుడు గదా నేధన్యురాలనౌటకు (ప్రకాశముగా) కుతలపతీ ! వేశ్యలన్ననెవరు ?

అర్జు—వేశ్యలనఁగ వెలయాండ్రు

ఊర్వ—అనఁగ ?

అర్జు—ఎవరుధనమిచ్చిన వారినేమగనిగాఁ జేకొనువారు.

ఊర్వ—అట్టివారలీ స్వర్గమునందునుండిరిసుమా

అర్జు—ఔను.

ఊర్వ—వారు మేమేనా ?

అర్జు—ఆఁ! గంధర్వులే (అని తలవంచుకొనును)

ఊర్వ—ఏమి తలవంచుకొనెదవేల వేశ్యలము మేమే!

అర్జు—(తనలో) ఆహా! రానురాను నన్ను గోతిలోనికిఁ ద్రోయుటయే సూచించుచున్నది. ఏమైనను ధైర్యమా! నన్ను విడకుము ధర్మమా! జాగ్రత్త. నన్ను వదలకుము (ప్రకాశముగా) అమ్మా! ఔను.

ఊర్వ—రాజచంద్రా! మాలోకవేశ్యలకువలె ధనముగావలెనామాకు?

అర్జు—నాకుఁ దెలియదు.

ఊర్వ—అబ్బె! ధనమవసరము లేదు మనస్సే ప్రధానము. భూపాలతిలకా నేనింద్రున కేమౌదునో యెఱుఁగుదువా?

అర్జు—అమ్మా? భార్యవు

ఊర్వ—అబ్బెబ్బె! భార్యనుగాను.

అర్జు—(ఆశ్చర్యముతో) భార్యవుగావు?

ఊర్వ— గీ॥ అగ్నిసాక్షిగఁ బెండ్లాడి ♦ నట్టియతివ ।
శచియె కాని నేఁగానువి ♦ శాలనయన ! ।
కంతుకేళీవిశేషసం ♦ గతులఁ దేల ।
నుంచుకొన్నట్టి వెలయాలి ♦ యువిదగాని॥ 7

అర్జు— గీ॥ అమ్మనీవెంత వెలయాలి ♦ వైననమర ।
భర్తకుసతివిగానసఁ ♦ బాడిగాదు ।
అగ్నియఁటెసాక్షిదీనికో ♦ యమ్మ; మనసె ।
ప్రప్రధానమునుమ్మప్ర ♦ పంచమందు ॥ 8

ఊర్వ—సెబాసు! బాగుగా నుడివితివి! ఆమనసేమారిన యెడల మా వేశ్యలు! వేఱొకనిఁగూర్చుకొనవచ్చునా?

అర్జు—అమ్మా! ఈవృథావాగ్వాదమెందుకు?

ఊర్వ—ఇఁక నెట్లమ్మాయని నన్నుఁబిలచెదవు?

అర్జు—అయ్యో ! అట్లనెద వేటికి ?

ఊర్వ—నామన సేగాదా ప్రధానము ?

అర్జు—అయిన ?

ఊర్వ—ఇఁక నేనట్లు పిలువవలదనిన మానెదవుకదా ?

అర్జునుడు—

ఉ॥ ఆడఁగరాని యట్టినుడు • లాడెద వెందులకిప్పుడమ్మరో ! ।
పాడియఁటమ్మ యమ్మయిని • పల్కఁగవద్దని తెల్పఁబోవఁగాఁ ।
గాఁడెనురాలికిన్ నృపతి • కాలుచునాత విసీవుగూడుఁటే ।
నాఁడఁటెయమ్మరోయతఁడు • నాదగుకూరిమితండ్రి కాఁడఁటే ? 9

ఊర్వ—సుముఖీవృత్తము. సరి ! సరి ! రాజు • సకారణమా ।
సురపతికీవు • సుతుండవెటుల్ ।

అర్జు— అరరె ! యదేటి • యబద్ధమెని ।
ర్జరపతినన్వ • సఁగాంచెగదే. 10

ఊర్వ—(తనలో) అయ్యో! ఇఁక నాకోరిక నిష్ఫలమీనా? అమ్మాయను మాట మానుటకే యొల్లఁడు నన్నొల్లునా? అయినదైవము న్నాఁడుకదా ! నావెలయాలి తనపుఁటుక్కలన్నియుఁ జేయుదు.

ప్రకాశముగా)—

శశివదనవృత్తము—కనుమదెమింటన్ ।
ఘనముగనెండన్ ।
ననునినుఁ డేఁచన్ ।
మనఁగఁగలానే ? ॥ 11

(చంద్రుఁ జూపును)

అర్జు— చిత్రపద-అమ్మ ! యిదేటికి భ్రాంతుల్ ।
నెమ్మదిఁగాంచుముమింటన్ ।

దమ్ముల తేఁడతఁడౌనే ? ।
యిమ్మగు చంద్రుఁడుకాఁడే ? ॥ 12

ఊర్వ — (శోకము సూచించుచు) చంద్రుఁడేనా యిట్టిపనిఁ జేయుట?
నేనిఁక బ్రతుఁకగలనా ? నన్నురక్షించు వారెరిక్కడలేరా ?

అర్జు — ఈపె యేదోయొక ముప్పుఁదే నిశ్చయించుకొన్నది. ఏమైనధై
ర్యము విడువరాదు.

(ప్రకాశముగా)

చ॥ అరయఁగ నేటికిట్టివిర ♦ హానలవేదన మొందనమ్మరో ।

ఊర్వ — ఉ॥ నిక్కము దాపనేలధర ♦ ణీరమణా! నినుఁగోరి నామనం।
బొక్కమొగిన్ స్మరాశుగము ♦ లోర్వక సొక్కుచు సోలుచుండెనీ ।
యక్కునన న్నుఁజేర్చి మధు ♦ రాధరపానమనూనమానటుల్ ।
మక్కువఁ జేయనిచ్చి శ్రమ ♦ మాయఁగఁ జేయఁగదే నరోత్తమా॥ 13

అర్జు — (చెవులమూసికొని)
హరి ! హరి ! యేటిమాటలిటు ♦ లాడఁగనౌన పుత్రుఁడైనన్ ।
నరకమునందు ద్రోయుగమ ♦ నంబుమనంబున నెంచినావఁటే ।
మరులుకొనంగఁ బుత్రుఁడవె ♦ మాతరొ! కన్నజెనీకుఁ జెప్పుమా॥ 14

ఊర్వ — మత్తకోకిల —
చాలుఁజాలుర యేటిమాటలు ♦ చక్కగాఁబలుకెంగనో ।
దేలపుత్రుఁడ వౌదునాకిపు ♦ డింద్రుఁడే పతిగానిచో ।

అర్జు — నేలనీవతనిన్ద్యజింపఁగఁ ♦ నింతిమాతవు కావఁటే ? ।
జాలుఁబోవునె బంధపాశము ♦ సంగతున్ విడునంతనే ? ॥ 15

ఊర్వ — మత్తకోకిల —
రొక్కపున్ సతికేటిబంధము ♦ రోషముంచక వేగి మే ।
ప్రక్కకున్నను దీసికౌఁగిలి ♦ రంజిలన్ సలుపంగదే ।

(అని తటాలునఁ గౌఁగలించుకొనును)

అర్జు—(తప్పించుకొని)

అక్కటా! యిది యేటిమక్కువ ♦ లమ్మరో వినుమిందుఁబోఁడే |
యొక్కవాఁడ టెముఁ బురూరవు ♦ నొప్పఁగూడితి కాదటే? ॥ 16
అట్టిచో నిపుడీవు నాకిఁక ♦ నమ్మవౌదు వెయొప్పకో |
యిట్టినీచపుఁ గోరికల్ నను ♦ నీవు కోరఁగఁ బోకుమీ |

ఊర్వ—వట్టిమాటలి వేటివావులు ♦ స్వర్గమంచు నెఱుంగుమా |

అర్జు—పట్టులిట్టివి పట్ట బోకుమి ♦ స్వర్గమంచు నెఱుంగుదున్ ॥ 17

ఊర్వ—చ॥ అరసిననిట్టులాడెదవ ♦ యా వినుమీ యిటు నేపిసంగఁ జే |
తురహిఁ జెలంగి యంగనలు ♦ తోరముగాఁ దమకిష్టమైన యూ |
పురుషులతో సుఖంబులను ♦ బొందుదు రంతియ కాని వావులే |
రర! యనుమానమానక ధ ♦ రారమణా! ననుఁ గావ రాత్వరన్ ॥ 18

(అని బలవంతముగా ముద్దుబెట్టుకొనఁబోవును)

ర్జు—(తప్పించుకొని దూరమున నిల్చి)

గీ॥ స్వర్గమందున నిర్జర ♦ వర్గమునకుఁ |
జెల్లుఁగాని యమ్మరో నాకుఁ ♦ జెల్లునఁటవె? |
ధరణియందునఁ బుట్టియు ♦ ధర్మమార్గ
మునుఁ దొలఁగనౌనె ననుఁ జూచి ♦ జనులు నగరె? ॥ 19

ర్వ—ఓహో! భూలోకమందుననే ధర్మమంటివా మీ వేశ్యల
చర్యలనీ వెఱుంగవు కాఁబోలు నేఁ జెప్పెద వినుము,

ఉ॥ ఒక్కనిఁ బ్రక్కఁ జేర్చి మఱి ♦ యొక్కని రమ్మని పల్కుఁ బంపివే |
ఒక్కని వీథిలో నిలిపి ♦ యొక్కనితోఁ దన తల్లి మాటలాడఁగాఁ |
దక్కుచుఁ బంపు డక్కరలు ♦ ధారుణి నాయక! మేదినీస్థలిన్ !
రొక్కపు కాంతలందఱు నిరూ ♦ పణ జేయఁగ రానిజాణలే! ॥ 20

(అనిబుగ్గపైఁగొట్టి చిఱునవ్వునవ్వును)

అర్జు— (కొంచెముదూరముగఁ దొలంగి) నీవుచెప్పినట్లేయైనను మాలోకమందలి వేశ్యలువావులెంచి మఱికవయుదురుకాని.

ఊర్వ— (అర్థోక్తియందే) చాలుఁజాలు బాగుగాఁగనుంగొంటివి,

గీ॥ ధనమె ధవుఁడంచువారికి ♦ ధవుఁడువ్రాసె ।
ధవునిమార్గమొందుటసత్ప ♦ థంబుగాదె ? ।
ధనముతండ్రివిడిచిపుత్రు ♦ దవులతేదె ? ।
వావులిఁక నేటికో మాకుఁ ♦ బార్థివేంద్ర ! ॥ 21

అర్జు—హాయప్రచారము. భళిరె ! మాత! ♦ వరుఁడన మన ।
తలమెయుచే ♦ తనధనమును ॥

ఊర్వ— అటులనైన ♦ నమరపతియె !
జటిసతికయి ♦ చనినగతియె ॥
పడసియిపుడు ♦ వరునిగనిను ।
బడయవలయుఁ ♦ బలుకఁజనకు ॥ 22

(అనికౌఁగిలించుకొనఁ బోవును)

అర్జు—(తప్పించుకొని)

అలసగతి. కమలనయనాయిటుల ♦ గానిపనులన్ జే ।
తమునఁదలపంగఁగట ♦ ధర్మమఁటెనీకుఁ ।

ఊర్వ— విరులసుకుమారనను ♦ వేఁపకత్వరగావా ।
దములుపిడిమోవినిము ♦ దంబుగనుదెమ్మా ॥ 23

(తనకరంబున నాశ్లేషించును)

అర్జు—(తప్పించుకొని)

అలసగతి. అరయఁగని చేటివను ♦ లమ్మవినుమాని ।
ర్జరపతిప్రయారవులు ♦ రాణనినుఁగూడెన్ ।
ఊర్వ— సరిర! మొదలంటితివి ♦ చాలునిఁకనేలా? ।
వరతనుఁడ! మాకెపుడు ♦ వావులవిలేవే! ॥ 24

అర్జు— గీ॥ అమ్మ! మీకిటవావులు ♦ వమ్ములైన ।
నేనరుండనుగానఁటె ♦ మానముగలు ।
గంగవావులు నేనింకఁ ♦ గానవలదె? ।
తుచ్ఛసుఖములఁబొందియేఁ ♦ దులువఁగానె? ॥ 25

అర్జు— గీ॥ తుచ్ఛమెటులకో తనంత ♦ నిచ్ఛయించి ।
వచ్చుమచ్చకంటిని మఱి ♦ పణ్యవనిత ।
నఖిలభావజక్రీడల ♦ నారితేరి !
నట్టిదాననన్నుఁగవయ ♦ నఘమునగునె? ॥ 26

అనియుఁగాక

ఆ॥ వె॥ వావివరుసలంచు ♦ వాపోవుదూరక ;
మేనయత్తఁగూడె ♦ మీదుబావ ।
తల్లియైనతారఁ ♦ దవిలెమీదుకులపె ।
ద్దయగుచంద్రుఁడేమి ♦ తప్పఁజెందె? ॥ 27

అర్జు—అటులన్యాయముచేసిన వారలందఱుఁ బలుపాములఁబడినవారే ॥
చంద్రునికిఁ గళలు గోలంతచాలదా ?

ఆ॥ వె॥ చంద్రుఁగూడితార ♦ చక్కగాఁదిరిగెనా? ।
యమరపతిఁ గలసియ ♦ హల్యఱాయి ।
యయ్యె; సీతఁగోరి ♦ యులదశకంఠుండు ॥
కులముతోడఁదానుఁ ♦ గూలెఁగాదె? ॥ 28

ఇట్టివారెందఱో యుఁదురుగాన నామాటమన్నించి నన్నువదలుఁ

ము నన్నేల నరకకూపంబునకుఁ ద్రోసెదవు ?

ఊర్వ—ఆ॥ వె॥ నరకకూపమంచు ♦ నిరసింపగానేల ।

స్వర్గమొందినట్టి ♦ వరగుణుఁడవు ।

వెలపడంతిఁగూడ ♦ వెదరెదవేలరా ?

కౌఁగిలిచ్చిగావు ♦ వేగనన్ను ॥ 29

(అని చేయిఁబట్టుకొనును)

అర్జు—(వదలించుకొని)

ఆ॥ వె॥ వదలుమమ్మ నన్ను ♦ పాదంబులిఁకనేల ?।

వేశ్యవైననీవు ♦ విదితముగను ।

మాతవౌదు నిజము ♦ మఱపింపఁబోవునే ? ।

మ్రొక్కువాఁడ మఱియు ♦ మ్రొక్కువాఁడ ॥ 30

(మ్రొక్కును)

ఊర్వ—బంధురవృత్తము—

అరయఁజుఱుకు పలుకులలరమనమా ♦ హా! యిటునాటఁగనీకగునా ?

నరగమరునికఱకు శరములకునేఁ ♦ జాలఁగఁజాలనిఁకోసుగుణా !

అర్జునుఁడు—

మరువిశరములురువడిఁదఱగుటకున్ ♦ మాతరో ! నన్నడుగన్దగునా ? !

నరకబిలమునురకసాఁరగమనమున్ ♦ నాకకటాతిరమున్గనునా? ॥ 31

ఊర్వ—(తనలో) అయ్యో ! నాబ్రతుకింతేనా ! నేనిటులమరుబారికగ్గమైవిలపింపవలసిన దాననేనా ? ఎన్నియుక్తులఁబన్నినను వలలోఁబడుటలేదు యేమిసేయుదు నిఁకనేదిదిక్కు. (ప్రకాశముగా)

వసుధావృత్తము— విరహానలమున్ ।

మరగన్దలమా ? ।

వరసారసుధా ।
ధరమిప్డిడుమా ? ॥ 32

(అనిబలవంతముగాఁ గౌఁగిలించుకొని యధరంబానఁబోవును)

అర్జు—(తప్పించుకొని కోపముతో)

ఉ॥ అమ్మరో ! నేనునీకునొక ♦ యర్థముఁజెప్పెద నాదరింపుమా ।
తమ్ములఱేఁడుచల్లనయి ♦ ధారుణిపై బడినట్టిసుధాకరుం ।
డిమ్మహిమచ్చమాపినను ♦ నే నెప్పుడున్ బరకాంతఁగోర,ని ।
క్కమ్మగమాతవై నవినుఁ ♦ గన్నులఁజూడనుజూడఁజూడ నే ॥ 33

ఊర్వశి—

మ॥ సరిరా! బాగుగఁబల్కితౌర! సుగుణా ♦ సంతోషమయ్యెంజుమీ
విరహాగ్నిందపియించుకాంత మఱియుక్ ♦ వేశ్యాలలామంబుని ।
ర్జరభామామణి నాపయిన్ దమరికై ♦ చావన్నశంకింపకే ।
స్థిరమైయుండిననన్నువీఁడిననినుకా ♦ ఛీయంచు దూషింపరే? ॥ 34

అర్జు—గీ॥ అమ్మ! యెన్ని దూషణముల ♦ కైన నేను ।
బడుదుఁగాని తల్లులతోడఁ ♦ బరమతుచ్ఛ ।
మైనయంగజక్రీడల ♦ నందిధరణి ।
బ్రతుక లేనిఁకఁగరుణతో ♦ వదలుమమ్మ ! ॥ 35

ఊర్వ— నన్నుఁగవయలేవా ! నన్నుగవయలేవా ?

అర్జు— అమ్మ ! అట్టిపాపమొడిఁగట్టుకొనలేను.

ఊర్వ— ఛీ ! ఛీ ! నపుంసకా !

గీ॥ కోరివచ్చినవేశ్యను ♦ గోర్కులూరఁ ।
దవులనేరనివోరిపా ♦ తకవతంస ? ।
యిలనపుంసకుఁడవయియ ♦ హీనదీన ।
మానమానిమానినివలె ♦ మసలెదీవు ॥ 36

(నిష్క్రమించును)

అర్జు— గీ॥ పరలతాంగులతోఁగూడి ♦ పాపమొందు।
కన్నధరనపుంసకుఁడయి ♦ యున్నమేలు।
తల్లులనుబొంది యెంతోపా ♦ తకుఁడయిచెడు।
కన్నప్రాణముల్ వీడుట ♦ కరముమేలు।

అహహా! యీవేశ్యల వృత్తములు కడుంగడు నాశ్చర్యకరంబులుః

శా॥ వీరల్ మోహముజెంది రేనిమునులన్ ♦ వింతౌనటుల్దుష్టసం।
సారాంభోనిధిముంపఁగాఁగలరు మో ♦ సంబుల్కడుఙ్జేయుచున్।
మారుంబారికినగ్గమహాపురుషులఙ్ ♦ మన్నించివారిఙ్దుదఙ్।
ఘోరంబైనదరిద్రదేవతలఁగాఁ ♦ గుందింపరే?ధారుణిఙ్॥ 38

కనుక నే!

గీ॥ ధర్మ్మమనుతీవనఱకుసా ♦ ధనమటంచుఁ।
బాపరూపంబుజూపించు ♦ ద్వారమనుచుఁ।
గష్టములనుమనఁబోన్పురా ♦ క్షసియటంచుఁ।
జెప్పనొప్పనురాక్కంపు ♦ జేఁడెనెపుడు।

యవనికజాఱును.

ఇదిచతుర్థాంకము.





ఓమ్

శుభమస్తు.

# పాశుపతార్జునము.

## పంచమాంకము.

### 1వ రంగము

ప్రదేశము—స్వర్గపురము బయలు

ప్రవేశము—గోపుఁడు.

గోపుఁడు—ఈసారి యెంత యొక్కుదెబ్బతో లఘక్కని పడి, పోరుసైన్యపు బలమేమున్నది. గాడిదిద్రుడ్డు! అంతయు నామహానుభావునిదే!! పోనిమ్ము నాకేటికి? ఎవరిదియో యొకరిది. ఏదియైనను మా దేవతలకు గొంచెము గ్రహములపాటు బాగున్నది. మొదట నెన్నిదెబ్బల తినిరిరా! దెబ్బదెబ్బకు నొబ్బట్టుముక్క నోటిలో నుండి జాఱిపడినట్లు కడుపులోని ప్రేగుల వెడలఁ గ్రక్కిన వార లేకాదా? వారమ్మకడుపు చల్లగా వారంద అమరులైనందున బ్రతికిరి. (పరికించి) వాఁడుగో మన నిర్భాగ్య దామోదర చక్రవర్తియగు నంద ద్వారపాలక తిలకుఁడు! వీనినాడించెదగాక

నందు—(ప్రవేశించి) వెఱ్ఱిముండ కొడుకులలో నొకటవరకము మీాఁదఁ బడిన వేశ్యకాంతను వదలిన నిర్భాగ్యుఁడీతఁడొక్కఁడే! ఆపె నన్నే యడగినచో నింత చిక్కులు బెట్టుదునా ముద్దులమూట వలె నాదరించనూ? పోనిమ్ము నరకీటముల కేమి తెలియును సురలోక వేశ్యలపస (పరికించి) అదిగో! వెంకిదిప్పకాయ తిమ్మ

న్నాచార్యుఁడుగాఁడగు గోపుఁడు. మొన్ననాకు మృత్యుదేవత
ను జూపించిన వాఁడీతఁడేకాఁడా! రానీ యేమిచేయుదునో?

(అనికూర్చుండును)

గోపు- (సమీపించి) తాతా! నమస్కారము

నందు-(కోపముతోఁ దటాలున లేచి) దంతభగ్నమస్తు! చింతాభివృద్ధిర
స్తు, స్త్రీలచేఁ దన్నులుసిద్ధిరస్తు నాచేతఁదిట్టులు సిద్ధిరస్తు యు
ధాప్రకారసిద్ధిరస్తు

గోపు- తథాస్తు.

నందు- ఛీ నీతోమాట్లాడను పో!

గోపు- తాతా! కోపమా! నీకొకచిత్రము జెప్పెదను.

నందు- మృత్యుదేవత యేనా?

గోపు- అబ్బే మనయూర్వశి మొన్న

నందు-అదినాకక్కఱలేదు నేవిన్నాను.

గోపు- అయిన నిన్నసభలో నేమిజరిగినదో నీవు వింటివా?

నందు-వినలేదు.

గోపు- అయిన వినుమట్లాయూర్వశి శపించిన తరువాత నింద్రుఁడు మహా
మహానుభావుని ధైర్యమునకు ధర్మశీలతకు మెచ్చి యీనపుంస
కత్వము ముందజ్ఞాత వాసములో మాత్రముండునని వరమిచ్చెను

నందు-సరి సరి, తరువాత.

గోపు- తరువాత మన దేవతులందఱాతనిఁ దమ శత్రువులనిగ్రహించుమని
బహుభంగుల వేఁడికొనిరి. వాఁడు నియ్యకొని యీదినముననే
బయల్దేర నిశ్చయించుకొన్నాఁడు. అదియేయీసందడియంతయు

నందు-బాగాయున్నది (తలయూచి) గోపా! యుద్ధమన్న నేమిటో యెఱుఁగుదువానీవు?

గోపు- ఎఱుఁగకేమిరా! సాధారణముగా నిద్దరుజేరుదురు.

నందు-ఆపైని?

గోప- అపైని నేమున్నది? సమీపించిన దంతయునూయము జేయుట యే

నందు- అనఁగ?

గోపు- అనఁగ నేమున్నది? గోతిలో నూరక పడవై చుకొనుటే

నందు- ఎక్కడిగోతిలో

గోపు- ముక్కుక్రిందగోతిలో!

నందు- అనఁగ మ్రింగుటయనియా?

గోపు- మ్రింగకపోయిన నెట్లున్యాయమగును?

నందు- చంపరా?

గోపు- అబ్బే! చంపరు.

నందు- చంపకున్న నెట్లు?

గోపు- ఊరక నోటిలో వైచుకొనుట.

నందు- వేనిని?

గోపు- గారిముక్కలను

నందు- ఆరిదొంగముండాకొడకా! యుద్ధములో గారిముక్క లెక్కడివి బ్రాహ్మణార్థమనుకొంటివా యేమి?

గోపు- బ్రాహ్మణార్థముకాక నీకునాకు యుద్ధముగూడనా?

నందు- ఇదియా నీవెరిగినయుద్ధము

గోపు- నీకేకాదు మనవారందఱికింతే పద పద.

(నిష్క్రమణము)

2 వరంగము.

ప్రదేశము | ప్రవేశము
సముద్రతీరము | అర్జునమాతలులురథారూఢులై

మాతలి-ఆహా! యీలోయధింజూడుము.

శా॥ వాతోద్భూతమహోన్నతోగ్రచటుల ♦ ప్రాప్తాగ్రభకల్లోలసం
ఘాతోద్ఘాతముచేతనాతతగతిన్ ♦ గట్టంతయార్వన్ భవ
ద్ధతిగ్రాతము తీవ్రమైతగులఁగా ♦ నిందుండఁగాలేనియీ
భీతారాతుల రోదనల్ తెలిపెడిన్ ♦ భీభత్స! భీభత్సమై॥

అర్జు——మాతలీ! యిదియేనా వారుండుతలము! అహా! ఇఁకజాగుసేయ నేల కాలకేయాదులఁ గాలుగేహమునకుఁ బంపుకాలము వచ్చినది. దానినే యియ్యుదధియుఁ దత్తటీఘటిత నీరకణములను బుష్పవితానమట్లు తన్నంతయు బాధించు రాక్షసాధములఁజంప నేతెంచు మనలకై యెసంగి సూచించె. మఱియుఁ దన్నీ యసురులు ప్రక్కలోని బాకులై నొప్పింప రక్షింపరో యనునట్లో యోంకారనాదముతోఁ దల్లడిల్లుచుండె. ఇఁకఁ దడయనేల?

మాతలి- కుమారా!

మ॥ అదెవారుండు ప్రదేశమచ్చటనెను ♦ మ్మారాక్షసుల్లెక్కకున్
బదియార్లక్షలుగాఁగ నుండిరిటనె ♦ వ్వారైనవారిన్ గలం
పఁదలంచేనిపదిలంబు సుమ్మసులభ ♦ ప్రాయుల్వెలెఁ జూచుటో
ప్పదువేఱొక్కటిగాకపాశుపతమున్ ♦ బ్రార్థించు మా పార్థివా!

అర్జు——(ఉత్సాహముతో) మాతలీ! వారినిప్పుడనిర్జించి నిర్జరులకమితానందముఁ గూర్చెదఁగాక నీవనిన పాశుపతమె వీరిపైఁ బడకు లాగుఁగాక!

(అనిపాశుపతమును సంధించి)

గీ॥ దివ్యబాణశతములనెల్లను ♦ దివ్యమైన
పాశుపతము! నామీఁదఁగ్రొ ♦ వం జెలంగి
యమరకంటకులగు వీరి ♦ నాహవభువిఁ
దెమ్మనే వీరి సమయింతు ♦ దివిజులలర॥ 3

(తెరలో గలకలము)

మాత- [పరికించి)

గీ॥ అల్లదేకను పాశుప ♦ తాస్త్రమసుర
పురములెల్ల నీవాఁడితూ ♦ పులకునగ్గ
లంబుసేయఁజొచ్చెనీఁకము ♦ దంబుజెంది
చంపుమయ్య వేవారిని ♦ ర్జరులు జెలఁగ॥ 4

అర్జు—మాతలీ! యిదేచూడుము వారచ్చటఁ గుమిగూడి రింక వేగము
గా వారిపై పురకు రథముఁ దోలుము,

(నేపద్యమున)

శా॥ ఓరీమానవ కీటకా! యిటులరా ♦ నొప్పెన నీకింకమా
క్రూరాస్త్రాళినినోర్వఁగాదరమ! నీ ♦ కున్ నిన్నుఁబుట్టించు నా
నీరేజోద్భవుకైన? నిప్పుడునను ♦ మన్నింపన్ దయన్ జూతుమీ
ప్రారంభంబులుమానిపొమ్ము ♦ భవదస్త్రాళుల్ మముల్ దాకునే?

(తరువాతఁబెద్ద కలకలము)

ర్జు— (విని)

ఉ॥ కాఱులఁ బేలనేల నిఁక ♦ గాండివముక్తశరాళిమిమ్ములన్
గాఱియబెట్టకున్నె? సుర ♦ కంటకులార! కనన్ భయంబునన్
బాఱిచనంగనే విడుతు ♦ మాకిఁక నేల యటంచు నాజిలో
నాఱడిపోక సుస్థిరత ♦ నాగుఁడు జూతురుయుద్ధపద్ధతుల్॥

మాతలి! వేవేగ రథమువారిపై బఱపింపుము.

మాతలి—చిత్తము అని రథముతో నిష్క్రమింతురు.

(వెంటనేయిద్దరు రాక్షసులు ప్రవేశింతురు)

1 వ రా!—ఓరిబాబో! చిచ్చులపిడుగు (వెనుకనొకబాణము దగులుట సూచించి) అమ్మ చచ్చితివిరా! మృత్యుదేవి కోరలుగూడఁజూచితిఁగాని యింత బెడిదముగా లేవు.

2వ రా—బాణపుదెబ్బలఁదిని తన పెద్దకడుపు నాడజేయుచు ఓరీ! దంభా యీదెబ్బలబ్బ మాయబ్బఁగ్రిందకు దింపుచున్నవిరా?

దంభు—ఓరీ లంబోదరా! ఒకసారియముఁడు నన్నుఁగఱచెఁగాని యీబాణమంత బాధఁగల్గింప లేదు. వీఁడెవఁడో ఛండశాసనుఁడురా?

లంబో-(తనబొజ్జగురగురనెగురుచు) ఓరిబాబో! యీసందడిలో మనవారందఱుగోవిందంగొట్టునట్లు గనఁబడుచున్నది. మంటలు మిన్ను మన్ను గప్పివేసినది చచ్చితిమిరా పద! పద!

దంభు—ఔనౌనుబాబో! యీసందడిలోఁ బాఱిపోదమురారా!

లంబో—హర! హర! ఎట్టిపాపపు దినములు వచ్చినవిరామనకు గాదె క్రిందఁబందికొక్కులవలెఁ దినితిని నిగనిగలాడు బొజ్జలతో మనవారందఱు గజ్జుపెండలమువలె మాడిపోయినారురా! గ్రహచారమిట్లు వచ్చిన దేమిసేయుదము.

దంభు—అబ్బబ్బ! యీదుఃఖమూరకనాహృదయములోఁ జీమమిరపకాయదినినట్టు చుఱ్ఱుమని మండిపోవుచున్నదిరా!

లంబో-అబ్బబ్బ! యీబొజ్జతో నెంతమందిని నిట్టేయని పడగొట్టితిరా? ఎంతప్రారబ్ధంవచ్చినదిరా నాబొజ్జకు.

దంభు—ఓరి! గరిశపాణకవలె నుందునీబొజ్జతో యుద్ధముగూడ జేసితివిరా?

లంభు—ఏమిరా! అలాయనుదువు. దాకవలె నున్న నానోరు దెఱచినను మాకుంభకర్ణుఁడు మామకువలె నెందఱో సురలు చీమలునీగలు లోనికి బోయెడివారు. అదియుఁగాక వారేనన్నుఁగొట్టినను నేను మీఁదబడుటచే వారే నలిగి యట్టేపోయెడువారు ఎందులకవి యన్నియుఁ బోయినవి. కానిముండాకాలమువచ్చినది.(పరికించి) ఓరిబాబో యిదేమిటిరో భూమ్యాకాశంబులు గటికి చీకటి నిం డుచున్నది.

దంభు—ఏమియులేదు! మనవారలాతనిపై నిడిచిన మహాంధకారాస్త్రము. రమ్మురమ్మా సందడిలో నొకచీపురపుల్ల యైననుజాలుమన ప్రా ణములు దీయుటకు.

లంభో—ఔనౌను. సరేసరే పద! పద!

(నిష్క్రమించును)

(వెంటనే యర్జునమాతలులు రథారూఢులై ప్రవేశింతురు)

మాతలి (భయార్తుఁడై)

చ॥ అధికజవంపు దేరునకు ♦ నయ్యయొ! క్రోధివిరోధిచర్యనే
విధమునఁజూడ దారికను ♦ పించదు నీవెట్టులైన నన్నునీ
యధమతమంబువాపియగ ♦ తాసునిఁజేసి నరాశనాళినే
విధివధియింతు వొసుమివి ♦ వేకధురీణ విచారణోచ్చణా॥ 9

అర్జు-ఉ॥ మాతలి! యేటికీ వెఱపు ♦ మచ్చరరాజిని మత్సరాసుర
వ్రాతము నిప్పుడేయమునిం ♦ పట్టణమేగఁగవేగఁ జేతునా
చేతలుకన్నులారఁగని ♦ చేతమునందున మోదమందుచున్
జూతువుగాత మీతమము ♦ సూర్యశరంబున మాయఁజేయనే?

మాతలి-కుమారా! కన్నుల వెనుకంతయుఁగానరాకుండ నీతమోరాశి

లుగప్పివైవ నేనీరథమెట్లు తోలుదు. పూర్వపు దేవాసుర యుద్ధములో నుండగా నిట్టి విచిత్రాంధకార మెప్పుడుఁగన లేదు. రక్షింపుము రక్షింపుము.

అర్జు- సారథీ! వెఱవనేటికి? చూడుమీ సూర్యాస్త్రము.

(అని బాణము నేయ జీకటి పోవును)

మాత- (సంతోషముతో) అమ్మ! బ్రతికితినిప్పుడు చూడు నారథచోదక సామర్థ్యము,నీబాణములకన్న నతివేగముగాఁబోవునట్లుతోలుదును (అని తోలును)

అర్జు—మాతలీ ! మాతలీ !చూడుచూడుమీ.

గీ॥ కాళసవతంసులెల్లరు ♦ రహిఁజెలంగి !
యెదురుజూచుచుఁగాఁలిలు ♦ వదరుచుండ్రి !
తోలుమటువైపుమనరథ ♦ మాలమునకు !
వారిసమయింతుదివ్యాస్త్ర ♦ వరములేసి ॥ 9

మాతలి—చిత్తము. (నిష్క్రమణము)

(వెంటనే దంభలంబోదరులు ప్రవేశింతురు)

లంబో—అయ్యో ! అయ్యో చచ్చితిమిక నేమున్నది. (అనియేడ్చును)

దంభు—మనపనియైనది. హర ! హర! యిండ్లుకాలునప్పుడు బుగ్గియగుచూ తెలుకలవలె మాడుచుంటిమిరో మామయ్యా (ఏడ్చును)

లంబో—ఎంతపని వచ్చినదిరా యల్లుఁడా (ఏడ్చును)

దంభు—నీబొజ్జకెంతపోటురా మామయ్యా. (ఏడ్చును)

లంబో—ఎంతమందిని దినినదిరా యీబొజ్జ యల్లుఁడా (ఏడ్చును)

దంభు—ఊరబందిలా గుండువాఁడవుగదరా మామయ్యా (ఏడ్చును)

లంబో—నక్కపోతువలె నెన్నిశవములఁ దినెడివాఁడవురా అల్లుఁడా !

దంభు—చక్కెర కడ్డీలవలె నరులజప్పరించువాఁడవురా! మామయ్యా!

లంబో—చెఱకుగానుగలోఁబెట్టి మనుజులరక్తము బల్లసందుగాఁడీయు వాఁడవుగదరా! అల్లుఁడా (ఏడ్చును)

దంభు—మునులతలకాయలు కోడిపిల్లలవలె బెఱికితినువాఁడవురా మామయ్యా! (ఏడ్చును)

లంబో—ఆపండుగదినములు పోయినవిరా అల్లుఁడా (ఏడ్చును)

దంభు—మనకు గతియింతేరా మామయ్యా

(అనిఏడ్చుచుబోవుదురు)

(యవనికజాఱును)

—2 వరంగము—

ప్రదేశము—ఆయుద్ధభూమియే- ప్రవేశము-అర్జునుఁడు ఇంద్రుఁడుబృహస్పతి నారదుఁడు వరుణుఁడు.

అర్జు—మీవిధేయుఁడనగు నన్నునిట్లు స్తుతింపనగునా!

బృహస్పతి—కుమారా! ఇది పొగడ్తకాదు సుగుణనిరూపణము ముఖస్తుతియగునా! ఇట్టిమనస్థైర్యము దైవభక్తి సత్యపాలనవీని నన్నిటికన్న నెక్కుడునెద్దియునిన.

గీ॥ కోరివచ్చిపైఁబట్టినట్టి ♦ వారసతిని!
పరలతాంగియనివదలి ♦ తరయనీవు!
ధరణిఁబరదారఁగూడఁబా ♦ తకమటంచు!
బోధఁజేసితహాహా! యో ♦ పుణ్యచరిత! 10

ఇట్టి యగణ్యములైన సద్గుణములుంటచే నిన్ను స్తోత్రములుజేసినను మాకుఁదప్పులేదు.

వరు—పాండవమధ్యమా! నేనొక్కటి విన్నవించెద

గీ॥ సురలకునజేయులైనయ ♦ సురవరులను!
నోడబుచ్చిదేవతలకు ♦ వేడుకంద!

జేయనీసుగుణగణమె ♦ చెప్పవలెను ! ।
మఱియుఁబాశుపతమునొందు ♦ మనుజులుండ్రె ? ॥ 11

నార — అర్జునా ! మూఁడులోకములకు మార్గదర్శకుఁడవైతివి !

గీ॥ దేవతార్తినిబాపి ద ♦ యావతంసుఁ ।
డైతిపరసతీవిముఖత్వ ♦ మందిశౌచ ।
యుక్తుఁడవయితివిసత్యవా ♦ గ్వ్యక్తిమొకటి ।
నుండియుండెనీకంటెఁబు ♦ ణ్యుండెవండు? ॥ 12

నీయట్టివానికెందును శుభంబొసఁగూడుచునేయుండును.

ఇంద్రుడు — కుమారా ! ఇఁకనీవేనిఁగావలయునెడలఁ గోరుమొసంగుటకు దేవతలందఱతి కుతూహలులైయున్నారు.

అర్జునుఁడు —

చ॥ కరమరుదైనప్రేమనున ♦ ఖర్వసుపర్వవతంసులున్బ్రభా ।
కరసమబాణముల్తమరి ♦ కంటెబలాఢ్యునిఁజేయనిచ్చిభా ।
సురవరదీవనల్సలుపు ♦ చున్ననుమన్ననఁజేయుచుండఁగా !
వరములువేఱనున్నవె కృ ♦ పారసపూరితులార కోరఁగా ॥ 13

అయినను

మంగళమహాశ్రీవృత్తము.

దేశజనకంటకుల ♦ తీఁటడఁగధర్మమెట ♦ దివ్యముగఁదేజరిలఁగానే ॥
ర్వేశకృపచేతఁగడు ♦ నింపుగనువర్షముమ ♦ హీస్థలిసుకాలగతిగాఁగన్।
రాశులుధనంబులెట ♦ రమ్యముగనుండగధ ♦ రావరులుపూజకవులన్దా
రాశిరవుల్వాలెఁది ♦ రంబుగజగంబునను ♦ రంజిలుచుఁద్రాలుదురుగాతన్॥

ఇంద్రాదులు — తథాస్తు తథాస్తు.

(నిష్క్రమణము)

గద్య.

శ్రీమద్గాదేపల్లివంశ సల్లలిత పల్లవిత మల్లికావల్లీఫుల్లకుసు
మానుపమానపవిత్ర భారద్వాజసగోత్రా సమానానుభ
వైక బ్రహ్మవిద్యాధురంధర వేంకటశాస్త్రిపు
త్రమిత్రానందదాయ సుజనవిధేయసూ
ర్యనారాయణాభిధేయ విరచిత
పాశుపతార్జుననాటకము
పంచమాంకముతో
సంపూర్ణము.



# కీర్తనలు.

1 పేజి-8 లయిను. పరజురాగం-ఆదితాళం.

యిం॥ గురువర యూరు కష్టంబులు దారకోనే, దగగను తరి నరయుడు
వడిగన్ ॥ గు ॥

హరి హరి భరియింపగ నెటులోపుదు । దురితపుదనుజుల
దుడుకులకున్॥

గు॥ ఆపద లెంతటివారికి దప్పవు । నోపగవలయును నోరిమితో ।
పాపము పండిన పరిణతి చెందును । పలుగాకుల కదిఫలితము
గా, డెందము గందబురందర గుందకు । మిందుధరుని గృపనిది
దొలగున్ ॥

నా॥ గాలము జక్రము గతిదిరుగుటచే । గానగనగు సుఖగతులు
మరిన్ । శూలియురాక తాసోలియుడాగెను ! నేలను జింతిల
జాలునికన్ ॥ కా ॥

వరు॥ పుణ్యనదంబులు బూడ్చెను గాల్చెను । పురవరములు కడు
పూనికతో । పూపల నెల్లను పాపమనక పెను । కూపంబుల
బడగూల్చెనికన్ ।

ఆపదలకు నెటులోపగ వలయునో। కాపాడగదగుకడు వడిన్ ॥ పు

5 పేజి 13 లయిను హిందూస్థానీతోడి-రూపకంతాళం.

యిందృశు॥ హా ఈవిధి నేనెటుసైతున్ ॥ హా ॥

సతిసుతుల ఎవిడి । సతమువనినిబడి । మతిని నడలవలసెన్ ॥హా॥
నీడగుమేడల । జోడగుచేడెల । పీడిబారగవలసెన్ ॥ హా ॥ ఈ ॥
యెన్నడీ శూరుననూ । నేలగా గలుగునో । నెగుబనోగలనా
యేమూ ॥ హా ॥ ఈ ॥

312 పేజీ 4 లయిను అమీరుకళ్యాణీ-అదితాళం.

పి॥ మెంటో యింత సూశినావా । యేమిరా యీరా
॥ యిద్ది ॥యెం॥

పంతముతో బేసానోళ్ళ బౌసా వేసాలు ॥ జుట్టునిమురుకుంట్టుతిం
టుతిట్టు గాడెరు । వట్టిపట్టు రట్టుగోల కొట్టుకుంటారో ॥రాజులం
టారోరి యింటిలూరకొంటారు । రాచ్చసూలరీతిబోరీవచ్చిచో
సూడు ॥ యెం ॥ ౨

4-17- పేజీ 10 లయిను హిందూస్థానిభైరవి-రూపక తాళం-

అర్జునుడు కాంతరో నినుచూసి నిలువ । గలనటెలలనా ॥ చింతనొంద
నేల నత్తుశివృదయపలనా ॥ కా ॥ బంతముతో బాశుపతము
బడిశివడిగనా । బగతుల విగతుల జేయక బాధిం పుండనా ॥కా॥

(ద్రౌప॥ మీరలట్టి దిట్టలగుటమే నెరుంగనా ।
సూరులనుచే । కూరుసుఖను చూచుచుండనా ॥ మి ॥ ॥
గోలనగుట నిట్టులంట్టి గూరిమితో.గా ।
కాలగళుడు నేలు గరుణగర్వ మెడలగన్ ॥ మీ ॥

5-37- పేజీ 9 లయిను హిందూస్థానీతోడి-ఆదితాళం.

అర్జునుడు॥ పాహిశివా శంకరా । మాం ॥ పా ॥
నేరక నేచేయు । క్రూరము సైచియు । పామతీబ్రోవ రారా
దేవదేవ ॥ పా ॥ హి ॥ ౧ ॥
హరిహాయులై నా నిన్నరయగ నేరారు । క్రూరుండ నిం నెన్న
నేరనినరుండ ॥ పా ॥ ౨ ॥
అణువాదిగా జేగ । మంతా నీ వేగాద । డెలియక దలకొంటి ।
దేవా నేనింనొంటి ॥ పా ॥ హి ॥ ౩ ॥

6-44-20 లయిను శివకాంబోజిరాగం-అదితాళం.

•ద్వారి॥ సంతోసమాయేను । సఖియనాచిత్తామెమో ॥ సం ॥
యింతి యీవింత గనుమూ । చెంతా నేమనుము ॥ సం ॥
కలువల రేని నేలు । కనసీసుఖంబునా । కామవిజితాకారుడే ।

కామినీజూడు ॥ కామ ॥ సం ॥
వంతముతోడావిధి । సంతసమొందివడి । యింతివీనీశ్రృజించేనే
॥ కామి ॥ సం ॥
కనులకు పండువై । కానవచ్చెనునేడు ! కంధరానిభగాత్రుడే ।
కామి ॥ సం ॥
ఆచిన్నెలావన్నె। లాచేన్నులామిన్నా । లానెన్ననెవాడోపునే॥
యింతిరో చూడూ ॥ సం ॥

7-51 పేజి-10 లయిను జాంగలారాగం-అటతాళం.

మారుడా గరుడాసనుని కుమారుడా ఖలుడా । ననునేచకురజడుడా
॥ మా ॥ ౧ ॥
క్రూరుడా గేరడములనునిక । వీడరా నలుడా । వీడ । యిదిమేలే
చెంచెలుడా ॥ ౨ ॥
ిందమాయి । చందముగనను । గుందశేయగను । గుండ । వాని
పొందుగోరగను ॥ 3 ॥
యిందుడా నీవిందుడాయగ । నిందబొందెదురా । నింద। నీకెం
దుకిది విడరా ॥ యిం ॥ 4 ॥
హారువిదల । మట్టితివి వాగురు । దరుణిబట్టితివీ దరుణి ॥ జలి
వ్యథలముట్టితివీ ॥ యిం ॥ 5 ॥

8-67 పేజి 14 లయిను మలయమారుతంరాగం-అదితాళం

ద్యుమూడు॥ పుత్రునితోడదు రోక్తులు బలుకుట । పూబోడిరోదగునా ॥
నరులకీగాత్రము వతమగునా । నీతినిపీడన్ । పాతకముగడున్।
ఖ్యాతినిజడగూడున్ । దరుణిదన ॥ ఖ్యా ॥
శర్వా॥ వావివలననము । లరయగ । నిలవెల । దూలులకునుగలవా।
దేవవనితలకును నిదేద్రోవా। గలయగ మంమ్మున్ నిలయజ
నంమ్మున్ । జలుపరె పితృసుతులున్ । దేవనిల ॥ జ ॥

అర్జునుడు॥ అదియిదేయనగూ । డదు సుదతీదేహంబులు వేరుగదా
కర్మత్రజనత్రంబులు మారుగదా । తనయుడగాదా । తగదీబోధా
తన్వీరో బోరాదా । విడచియిక ॥ ద ॥

ఊర్వ॥ నాతులబాలిటి ఘాతకుడవుగా । ఖాతవిధించెనుగా । నిన్ను
యా । ధా । గనుగోతికి మతిజేడుగా । రాతసుఖింపన్ । జేత
నుగాతన్ నీతులు బలికెదుగా । దగనిబెర ॥ నీతు ॥

9-72 పేజీ-21 లయిను ఖరహరి ప్రియరాగం-అదితాళం.

ఊర్వశి॥ శపింతునిదివినుమా । ప్రౌనృపాల సత్తమ । కృపారహి
తన్నై ॥ శ ॥

సపాపుడగు మరుని తాపమునకే । నీపాలబడుబేల విఫలాత్మన
గుచున్ ॥ శ ॥ ౧

అపారసుఖముల కుపాయమగుతను । వుబాసినపుంసకవు బాని
శవుగా ॥ శ ॥ ౨ ॥

మమామహేశులను మానసమునిడి । యమానుమంబున శమిం
పనొల్లక ॥ శ ॥

10_83 పేజీ-17 లయిను బిలహరిరాగం-అదితాళం.

మంగళమానారె రిపుమదభంగునకును భసితాంగునకు ॥ ౧ ॥
పుంగవాతురంగునాకు । పురభటనటహాట ఘటితునకు ॥ ౧ ॥
మంగళమిళితాంగునకు । నంగనమణిరజితశృంగమున చెలంగు । కర
కురంగునకు ॥ మం ॥

పాశుపతార్జుననాట్య । రతోషునికభరితెభరతసం॥
భరితునకు । ధరరథునకు । హరిశరునకు। సురవరునకు ॥ మం ॥

సంపూర్ణము